

విజయవాడ కృష్ణా బ్యారేజీ దగ్గర అశోక స్తంభం [ముమ్మనేని సుబ్బారావు]

# మెడ బెణికినా సాయంకాలం షికారు మానక్కర్లేదు

అశాభంగమే! కాని సాయంకాలం హాయిగా వెళ్ళచ్చు. చేతి సంచిలో అందుబాటుగా ఒక అనోలియమ్ ట్యూబు ఉంచేసరి! అనోలియమ్ శీఘ్రంగా గుణాన్నిచ్చే బాధా నివారిణి. మృదువుగా అందంగా ఉండే మీ చర్మానికి ప్రత్యేకంగా తయారు చేయబడినది. ఇందులోని అమోఘమైన మందులు కండల నొప్పికి, తలనొప్పికి, గుండెజలుబుకి ఇంకా ఇతర జలుబులకి శీఘ్రంగా గుణమిస్తాయి. పసిబిడ్డకు కూడా ఉపయోగించవచ్చు.




అనోలియమ్
శీఘ్రంగా గుణాన్నిచ్చే సాధువైన బాధా నివారిణి.




అనోలియమ్
తక్కువవెల
డబ్బాలలోకూడా లభిస్తాయి.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/AN/2808

## దీపావళి ప్రత్యేక సంచిక

'సజీవశిల్పం' వారపత్రికకే మణిహారములా తళతళ మెరుస్తోంది. కథ చదువుతుంటే పత్రికను విడువ మనస్సు ఒప్పలేదు. కథనంత తొందరగా ఎందుకు ముగించారా? అని రచయితగారిపై ఒకప్రైపు కోపము వస్తున్నందులకు క్షమించండి. ప్రేమ అనునది ఒక పిచ్చి అని, ఆ పిచ్చి ననుభవించు పిచ్చివాడికే ఆ పదములోని సారం అర్థమవుతుందని, ఆత్మలు దూరమయినా, అంతఃకరణాలు దూరముకావని, పూలదండలోని పూలు, వాటి సువాసనను కోల్పోయి, వాడిపోయినా, రాలిపోయినా వాటిని బంధించిన దారమమాత్రం శాశ్వతంగా ఎలాయుండునో అలాగే శరీరాలు కృశించినా, అందం కోల్పోయినా, వృద్ధాప్యము సంభవించినా ప్రేమ మాత్రం శాశ్వతం అని రామనాథం, శారద ప్రేమ కథ ద్వారా ప్రజలకు నుడివిన రచయితగారి నెలా అభినందించాలో, కృతజ్ఞత లర్పించాలో అర్థం కాలేదు. ప్రేమ—అనే తియ్యటి మాధుర్యాన్ని పాఠకులకు వెదజల్లిన శ్రీ రంగధామ్‌గారికి హృదయపూర్వక అభినందనలు.

జి. బాబారాయుడు (కమలాపురము)

* * *

మీ దీపావళి సంచికలో మూడవ బహుమతి కథ "సజీవశిల్పం" లో మొదట శారద భర్త చనిపోయినాడని, తర్వాత చివరలో ఆమె భర్త రామనాథం పేరుగల ఇంకొక ఆయనే ఉన్నారు అన్నారు. ఇవి పరస్పర విరుద్ధంగాను, కథలోని సజీవ చిత్రణకు భిన్నంగాను ఉన్నది. మిగతా కథలు బాగానే ఉన్నవి.

చివుకుల శ్యామలాదేవి (బెంగుళూరు)

* * *

దీపావళి కథల బహుమతులు రచయిత్రు లెవరూ పొందకపోవటం నాకు మహదానందం.

సి.వి. పతి (స్వజాత్యాభిమాని. విజయనగరం.)

* * *

ఈ సంవత్సరం దీపావళి పోటీ కథానికలో క్రొత్తదనంలేదు. బహుమతుల నిర్ణయం సక్రమంగా జరుగలేదేమోననిపిస్తున్నది. మూడవ బహుమతి పొందిన "సజీవశిల్పం" ఒకటే బాగుంది. మొదటి, రెండవ బహుమతులు పొందిన కథానికల స్థాయి మామూలు కథలకంటె గొప్పగాలేదు. దీనినిబట్టి చూస్తే కథా రచయితల సామర్థ్యాన్ని పెంపొందింపజేయాలనుకున్న నిర్వాహకుల ఉద్దేశ్యం నెరవేరలేదనే చెప్పవచ్చు. రచనల స్థాయిని రచయితలే స్వయంగా పెంపొందింపజేయాలేకాని ఇలాంటి పోటీలవల్ల ప్రయోజనం లేదేమో? ననిపిస్తున్నది.

డి. మధుసూదన్ (హైదరాబాదు)

* * *

ఎంతో ఆతృతతో ఎదురుచూచిన దీపావళి సంచిక చేతికి రానేవచ్చింది. ముచ్చటైన ముఖచిత్రంతో చక్కని కథలతో పత్రిక చాలబావుంది. ముఖ్యముగా మొదటి బహుమతి పొందిన 'తెర వెనుక దీపం' కథ నా మనస్సుకు బాగా హత్తుకుపోయింది. ఈసారి బహుమతుల పంపకములో

# ఉత్తరాలు

పై కథకు మొదటి బహుమతినిచ్చి న్యాయం చేకూర్చిన మీకు, చక్కటి కథను పాఠకుల కందించిన రచయితకు నా హృదయపూర్వకాభివందనలు.

'రత్న' (విశాఖపట్నం)

* * *

మీ దీపావళి సంచికలోని "తెర వెనుక దీపం" కథ చాలా బావుంది. శ్రీ ప్రభంజనస్వామిగార్కి నా అభివందనలు తెలియజేయగోర్తాను.

రాచకొండ విశ్వనాథశాస్త్రి (విశాఖపట్నం)

* * *

'సజీవశిల్పం'(మూడవ బహుమతి పొందిన కథ)లో (59 వ పేజీ) —"మొహంమీద బొట్టు లేకపోవడం వల్ల ఆమె విధవ అని తెలుస్తోంది" అని వ్రాశారు. ఒక చిన్న సందేహం మొహం (నుదురు) మీద బొట్టు లేనివారంతా విధవలేనా ?

పి. జె. రావు (అంకులోయు)

* * *

శ్రీమతి భానుమతి రామకృష్ణగారి వ్యాసం ఎంతో వివాద పరిష్కారంగా ఉన్నది. వారి వ్యాసం అవలోకిస్తున్నంతసేపు వారిలోనుండి అవిరళంగా టాంకులోనుండి ప్రవహిస్తున్న పరిశుద్ధ ధారాజలం వెలువడినట్లు తోచక మానదు.

ఇక వారినుండి అంతస్థుల బాధలు తెలియక మానవు వారి రచనా పటిమ మన మనస్సులలో నిర్మలంగా నిలువక తప్పదు. వయస్సులోని సరదాలు ఎంతవరకు జీవిస్తాయో తెలుపును. ఇటువంటివారికి అందులో తెర తారగా పరిచితమైన వారికి ధన్యవాదాలు అర్పించడం సమంజసం.

రతన్‌కుమార్ (కలకత్తా)

* * *

"నేనూ—నా బొమ్మలూ !" అన్న శీర్షిక క్రింద శ్రీమతి భానుమతిగారు దీపావళి సంచిక (6—11—64) లో వివరించిన తన అనుభవాలు, బొమ్మలకొలువు వర్ణనలు చాలా బాగున్నవి. కాని, కొన్ని విసురులు, వెటకారాలు, వ్యంగ్య చిత్రణలు తనకోవకు చెందినవారిపైన చొరవ చేసుకొకోవడంలో చూపెట్టారు. "అయినా కొందరు ఆడవాళ్లకు చిన్నప్పుడుండే ఈ సరదా కాస్త పెద్దవాళ్లవుతూనే సన్నగిల్లి, పెళ్లికాగానే వెనకపడిపోయి, పిల్లలు పుట్టగానే మూలబడుతుంది" అన్నారు. ఇందులో ఆశ్చర్యపడవలసిందిలేదు, అసహజమైనదీ లేదు. పైగా, అలా పరిణతి చెందకపోవడంలోనే ఉంది అసహజత్వం—ఇంకా లోతుకు పోవలసివస్తే, అది తీవ్రమైన మానసిక అనౌచిత్యాలకు, అస్వస్థతలకు అనుమాన కారణమౌతుంది. బాల్యపు చేష్టలు, సరదాలు, చాపల్యాలు, యౌవనం లోగా, మార్పు చెందకుండా నిలిచిపోయాయంటే, మానసిక దౌర్బల్యాలకు, రోగాలకు దారితీసే ప్రమాద మున్నది. అల్లాగని, భానుమతిగారిపైన నే నటువంటి సంశయాలు సూచించినట్లు గాదు. నిజానికి ఆవిడ బాగా పరిపక్వం చెందిన ప్రౌఢదృష్టితో బొమ్మలకొలువు చేసుకుంటున్నారు—తాను గుర్తించకపోయినా ! ఇతరులను, వారి మనఃప్రవృత్తులను విభజించి, పరిశోధనకు గురిచేసిన రీతిగా, తన తను ఆలోచనల్ని, భావాల్ని పరిశీలించలేకపోవడ మానవుల్లో సాధారణంగా కనిపించే లోపం. ఆమె చేసేది బొమ్మలకొలువే అయినా, తన వైఖరులు అభిప్రాయాలు, అభిరుచులు మాత్రం బాల్యేతరమైనవి. "దసరా ఇంకా నెలరోజు లుండనగా ప్రక్కనే ఉన్న మా స్టూడియో పనివాళ్లని పిలిపించి, కొలువుకు కావలసిన ఏర్పాట్లన్నీ చెప్తాను. ఆ తర్వాత నా బుర్రలో నేను పూహించే కొన్నట్లు కొలువంతా తీర్చిదిద్దుకోడానికి కనీసం పదిరోజులైనా పడుతుంది." అన్నారు. ఇక్కడ పూహలను ప్రణాళికాబద్ధంచేసి, ఆచరణలో పెట్టే విధానం కనిపిస్తుంది. ఇది ప్రధానంగా ప్రౌఢ దృక్పథం. "ప్రతి సంవత్సరం నేను పెట్టే కొలువులో ఏదో కొత్తదనం తీసుకురావడం నాకు చాలా సరదా !.... నేను స్వయంగా నా చేతుల్తో సృష్టించిన ఒక శిల్పం చూసి అందరూ బావుందని మెచ్చుకుంటే అంతకంటే ఆనందించాల్సిన విషయం ఏముంది !...." ఇది ముఖ్యంగా కళాత్మక హృదయానికి రుజువు. బొమ్మలకొలువు ఒక సాధన మాత్రమే. అట్లని, ఆమె సరదాలో ఉన్న నిజాయితిని శంకించినట్లుగాదు. ఆమెకు బొమ్మల కొలువులో ఉన్న ఆసక్తి, ఉత్సాహం ప్రశంసనీయమైనవి. ఈ విషయంలో, ఆమెకున్న నిత్య బాల్యత్వం బహు కొద్దిమందికి మాత్రమే ఉంటుంది. కాని, ఈ "బాల్యత్వం" ఆమె చెప్పేదానికి భిన్నమైనది!

సర్వేపల్లి రాధాకృష్ణపండితు లొకమారు, తన ఉపన్యాస సందర్భంలో జీనియసు (ప్రతిభాశాలి)కు నిర్వచనం చెబుతూ, స్త్రీత్వం, పురుషత్వంలోని మూలాధార లక్షణాలు, పసిపాప వెన్న హృదయంతో కలిసి ఏర్పడే ఒక వికాసంగా పేర్కొన్నారు (The Essential Man + The Essntial Woman + Child-Like Heart.)పురుషునిలోని పటిమ స్త్రీలోని లాలిత్యము,పసితనపు హృదయ సౌరభము, భానుమతిగారిలో గోచరిస్తాయి. తన చిన్ననాటి సరదాలు, ముచ్చట్లే, ఇప్పటికీ, బొమ్మలకొలువులో పొందగల్గడం తన హృదయంలోని బాల్యత్వానికి నిదర్శనం. తెలుగు సినిమా ప్రపంచంలో బహుముఖ ప్రజ్ఞావతిగా ఆమె రాణించగల్గటానికి ఆమె జీనియస్ కారణం. "నీ కెంత వోపికమ్మా... అయినా ఇన్ని పనులుండి ఆవిడ సరదా చూడు!.... ఎంత కొత్త కొత్త అయిడియాస్ వస్తాయో ఆవిడకి !" ఈ అభినందనలు ఆమెకు చాలా సంతోషాన్నిస్తాయి. కొంతవరకు, పలాయన వాదం పరోక్ష సంతృప్తిసాధన ద్యోతకమౌతున్నవి. కాని, జీనియస్‌లో ఈ లక్షణా లుంటవి. పరిమితులు దాటితే, మనోవ్యాధిగ్రస్త మవడం తథ్యం. అందుకే, జీనియస్‌ను పిచ్చితనాన్నుండి వేరు జేసేది చాలా పల్చటి తెర అని అన్నారు. భానుమతిగారు తమ ప్రతిభా వ్యుత్పత్తులు, రచనల ద్వారా, నటన, గానం ద్వారా కలకాలం తెలుగు దేశానికి అంతులేని ఆనందంగా పంచిపెడతారని ఆశిద్దాం !

ఎల్. ఎస్. మణి (వాల్తేరు) ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 20—11—'64
క్రోధినామ సం॥ కార్తీకమాస బ॥ పాడ్యమి
సంపుటము 57 సంచిక : 12

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*


## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

| | |
|---|---|
| విడిప్రతి | 30 పై. |
| సంవత్సర చందా | 15.60 పై. |
| 6 మాసాల చందా | 7.80 పై. |

*


ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"రాష్ట్రంలో బోలెడన్ని బియ్యం వున్నాయని మద్రాసు మంత్రులంటున్నారుగా."
"అవును. బియ్యం వున్నది వాళ్ళ ఇళ్ళల్లో కాబోలు!"

## మనలో మాట

నవంబర్ 14వ తేదీ 'బాలబాలికలకి పండుగ దినం.' అందుకే, ఈ వారం ఆంధ్రసచిత్ర వారపత్రిక 'బాలబాలికల ప్రత్యేక సంచిక'గా వెలువడుతోంది. వివిధ శీర్షికలు కాక, శ్రీ కలువకొలను సదానందగారి 'బంగారు నడచిన బాట' సీరియల్ కథ ఈ సంచికతో ప్రారంభం అవుతోంది. శ్రీ సదానందగారు ఆంధ్ర పాఠకలోకానికి సుపరిచితులే...

* * *

క్రికెట్టు మీద వ్యాసం వ్రాసిన శ్రీ గోపాలరత్నంగారు 'సైనిక్ సమాచార్' సహాయ సంపాదకులు. వీరి తండ్రిగారు కూడా సుప్రసిద్ధ 'పాత్రికేయులే'...ఈ వ్యాసంతో బాటు వేసిన శ్రీ సి. కె. నాయుడు గారి ఫొటో శ్రీ సి. కె. హరిదాస్ గారిది. ప్రచురించటానికి అనుమతి ఇచ్చినందుకు ఆయనకి కృతజ్ఞులము...

* * *

'ఆటమ్‌బాంబు భారతదేశం తయారు చెయ్యాలా' అనే విషయం మీద, మేము కోరినట్లే, పాఠకులు ఉత్తరాలు వ్రాస్తున్నారు. వచ్చేవారం నుంచి ప్రచురణ ప్రారంభించగలము...

* * *

వచ్చేవారం ప్రారంభం అయ్యే 'చికిత్సల అవధులు' శీర్షికలో కొన్ని వ్యాధులను గురించి శ్రీ డేవిడ్ ఎట్రిక్ వ్రాస్తారు. శ్రీ ఎట్రిక్ వ్యాసాలన్నీ అంతర్జాతీయ ఖ్యాతి పొందిన నిపుణులు పరిశీలించినవే!

## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన శ్రీ బాపు



# మళ్లీ అలాంటి బాలుడు

నా చిన్నారినేస్తాలకి, మీరందరూ వేడుకలు సంబరాలు చేసుకునే రోజు నవంబర్ పధ్నాలుగు ఎలా పుట్టిందో తెలుసా? ఆరోజు జవహర్‌లాల్ అనే బాలుడు పుట్టాడు. అతను పుట్టిన రోజే మీ అందరికీ పండుగరోజు అయింది. దేశంలో ఎక్కడున్నా యీనాడు బాలబాలిక లందరితోను ఆడుకుందికి వచ్చే మీ తియ్యని నేస్తం యీసారి మన మధ్య లేడు. ఎంత వెలితిగా వుంది! ఒకసారి తన చిన్నారి నేస్తాలకి ఉత్తరం రాస్తూ భారత దేశ ప్రధాని,అందరూ ప్రేమించే, అందర్నీ ప్రేమించేవాడూ-ఐన జవహరులాల్ నెహ్రూ యిలా రాశాడు:

"బాలలూ! మన మధ్య ఒక మహానుభావుడుండేవాడు. అతన్ని అంతా మహాత్మాగాంధీ అనేవాళ్లు, కాని మనం అతన్ని ప్రేమగా బాపూజీ అంటాము. అతను చాలా తెలివైనవాడు, గొప్పవాడు, కాని అలాంటి డాబు ఏమాత్రం చూపించేవాడు కాదు. పసిపిల్లవానిలా మంచిగా అమాయకంగా ఉండేవాడు. అతన్ని ప్రపంచం అంతా ప్రేమించారు. భయపడ కూడదని, యెవర్నీ ద్వేషించ కూడదని చిరునవ్వుతో అవాంతరాలను ఎదుర్కోవాలని అతను మనకి చెప్పాడు..."- ఈ మాటలు రాసిన నెహ్రూజీని మనం 'చాచా' అంటాము. మహాత్మాగాంధీ గురించి అలా రాయగల బుద్ధిశాలి నెహ్రూకి కూడా అక్షరాలా పై మాట ప్రతీది అతుకుతుంది. జవహర్‌లాల్ చాలా అందమైనవాడు. చాలా చదువుకున్నాడు. మంచి వాళ్ళల్లో మంచివాడు. అందరికన్నా పెద్దవాడు—కాని పసిపిల్లల్లో పసిపిల్లాడు. నెహ్రూకి ఒకపెద్దకోరికవుండేది. "దేశాన్ని తను ప్రేమిస్తున్నంతగా ఎవరూ ప్రేమించకూడదు" అన్నది అతనికి యిష్టం! అంతవరకూ బాగుంది. తను దేశాన్ని భవిష్యత్తులో గొప్ప దాన్నిగా చేయగల తీరులో ప్రేమించాడు. ప్రపంచచరిత్ర రాశాడు. భారతదేశచరిత్ర రాశాడు. కాని ఆయన కోర్కెలో రెండోభాగం వుంది. దేశం కూడా "తనను ప్రేమించినంత ఉదారంగా; ఎక్కువగా మరి ఎవ్వర్నీ ప్రేమించకూడదు అలావుండాలి తన "చరిత్ర" అనుకున్నాడు. ఇంతటి ఉదారమూర్తి ఇంత గొప్ప అమాయకుడు పసిపాపలా తన కోపాలను, యిష్టానిష్టాలను చలాయించాలని కోరుకునే వాడు-కోరిన యీకోర్కె చాలా చిన్నదిగా వుందికదూ? ఉందా? మరోసారి ఆలోచించండి. "తను ప్రేమించినంతగా తిరిగి ప్రతి ఒక్కరూ తనను ప్రేమించా"లనే ఆశయం, లక్ష్యం, అసామాన్యమైంది.అందుకు త్యాగంకావాలి శక్తి ఉండాలి, శ్రమపడాలి

మళ్లీ అలాంటి బాలుడ

# ఎప్పుడు ఉదయిస్తాడు?...

తపస్సు చెయ్యాలి. తపస్సులంటే ప్రయత్నం - తపస్సు అంటే నమ్మకం. జవహర్‌లాల్ 'ప్రజల మనిషి' 'బాలల బాలుడు'. ఆయన



కథ యీ దేశ స్వాతంత్ర్యసమరమంత పెద్దది! 'చాచా' రాసిన పుస్తకాల్లో అది చాలావరకు మీకు తెలుస్తుంది. 'డిస్కవరీ ఆఫ్ ఇండియా', 'గ్లిమ్ప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ'లు చదవండి! అందులో దేశాన్ని, ప్రపంచాన్ని, అతనెలా చూశాడో మీకు కనిపిస్తుంది.

జవహర్‌లాల్ నెహ్రూలో 'వయస్సు' ముసలితనం తేలేదు. అతని 'మరణం', మనలో 'మరుపు'ను తీసుకురాలేదు. అతని 'ఆచరణ' అంటే 'చెయ్యడం' అతని ఆశయం, అంటే 'చెప్పడం' రెండూ మంచివి. దేశంలో 'పారిశ్రామిక ప్రగతి' 'ఆర్థికాభివృద్ధి' అనే రెండు గొప్ప వృక్షాలకి విత్తు లతను నాటాడు. "అతను మనల్ని ప్రేమించినంతగా మనం అతన్ని ప్రేమించడం" అనే చిన్న వాక్యంలో పెద్ద చరిత్రవుంది. దాన్ని తెలుసుకోగల ప్రయత్నం యీరోజున మీరు ప్రారంభించండి. అతను 'బ్రహ్మాండమైన వ్యక్తి'-బహుస్వార్థపరుడు?- అతి త్యాగమూర్తి! తన భౌతిక కాయ [చితా] భస్మాన్ని దేశమంతటా కలపాలన్నాడు. తన తత్వాన్ని అందరికీ రంగరించి పోయాలన్నాడు. మంత్రగాడు జవహర్‌లాల్. అతను చెప్పిన వన్నీ ఆలోచించండి. గ్రహించండి అతని పటానికి పూలు పెట్టడం కన్నా అతని పుస్తకాలు చదవడం వల్ల మీకు చాలా తెలుస్తుంది.

'ఓహో'మని యీ మహా వ్యక్తి వెంట తిరుగుతున్న ప్రపంచం ఎందుకలా చేస్తోంది? అతని ఎడబాటు ప్రతీ కను కొలుకులోను ఒక వెచ్చని నీటి ముత్యాన్ని ఎందుకు పొదిగింది? ఇవాళ ఆలోచించండి!

"మళ్లీ అలాంటి బాలుడు ఎప్పుడుదయిస్తాడు? ఎప్పుడుదయిస్తాడు?" అనే ప్రశ్నకి జవాబుగా, ఎవరేనా ముందుకురండి-

జైహింద్!

ఇట్లు మీ పిచాజీ అన్నయ్య ★

# ఎక్కడ ఉదయిస్తాడు?...






నువ్వేదైనా మంచి పనిచేస్తే మీ అమ్మ నిన్ను "మా బంగారే" అంటూ మెచ్చుకుంటుంది కదూ?...కనుక మంచికి మరోపేరు బంగారు ఔనా?...

బంగారయ్య నిజంగా బంగారే! ఒకవేళ బంగారుకంటే మించినది మరేదైనా వుందంటే-అది బంగారయ్యే! నా మాటల్లో నీకు నమ్మకం లేకపోతే మీ ఊళ్లో మామిడి తోపులో కూర్చుని పాటలుపాడే కోయిలమ్మ నడుగు. అటుప్రక్కనే జామిచెట్లోని తేనెవలుకుల రామ చిలుక నడుగు. గుడి గోపురంలో కాపురంచేసే పావురాయి నడుగు. లేదా దిక్కులన్నీ తిరిగివచ్చే మేఘాన్నడుగు.. అవేం చెపుతాయో!... బంగారయ్య బంగారంత మంచి వాడని వాటి భాషలో అనకపోతే నా చెవి కోసుకుంటాను. అయితే నీకు వాటి భాష తెలియదంటావా? దానికి నేను పూచీగాడు.

మామిడిచెట్లో కోయిల, జామిచెట్లో రామచిలుక, గుడిగోపురంలో పావురము, దేశాలుతిరిగే మేఘమూ, అన్నీకూడా బంగారయ్యను బంగారు అనే అంటాయి. గలగలపారే సెలయేటితో— పచ్చని పచ్చిక తివాసీలా పరచి పెట్టిన మైదానం. మైదానాన్ని ఆనుకుని ఒక చిట్టడవి. చిట్టడవికి ఉత్తరాన ఎత్తైనకొండలు, కొండలకావల దట్టమైన కీకారణ్యం!

మైదానంలో ఒక చిన్నగుడిసె వేసుకుని తన భార్య రత్నంతో కాపురం వుంటున్నాడు బంగారు. బంగారంలో రత్నం అమరినట్లు వారిద్దరి దాంపత్యం చూడ ముచ్చట గొలుపుతూ వుంటుంది. రత్నానికున్నవి రెండేరెండు ఆభరణాలు. ఒకటి—ఆమె ముక్కున వున్న బంగారు బులాకి, రెండు—తనభర్త బంగారు.

బులాకీ దానివన్నెచేత ప్రకాశిస్తే—బంగారుకు వన్నెనిచ్చేవి అతని సుగుణాలు. అతడు ఏప్రాణిని హింసించలేడు. ఎప్పుడూ అబద్ధమాడలేదు. ఎవరికీ ఏ అపకారమూ చేయలేదు. మోసమూ, అన్యాయమూ అంటే ఏమిటో అతనికి తెలియదు. ప్రేమ, దయ, సహనమూ, మంచితనము మొదలైన సుగుణాలతో నిండి తొణికిసలాడే కుండ వంటిది అతని గుండె.

అతనికి పాతికా ముప్ఫై వరకు కామధేనువుల వంటి పాడి ఆవులుండేవి. రోజూ వాటిని మైదానంలోను, చిట్టడవిలోను మేపుకుని సాయంకాలానికి ఇంటికి తిరిగి వచ్చేవాడు బంగారు. దూడలు త్రాగగా మిగిలిన పాలేతాము పిదుకుకునేవారు. రత్నం అరుమైళ్ళ దూరానవున్న గ్రామానికి వెళ్ళి పాలు పెరుగు, నేయి అమ్ముకుని వచ్చేది. రోజులు ఇలా గడిచి పోతున్నాయి.

ఇంటా—వాకిళ్ళు, భర్తతోపాటు పాలు పిదకడం మజ్జిగ చిలకడం, వెన్నతోడు పెట్టడం, నేయికాచడం, అమ్ముకురావడం, భర్త ఇంటవున్న వేళల్లో చిరునవ్వులుచిందే మోముతో కబుర్లు చెప్పడం, ఒంటరిగా వుండి తీరికగా వుంటే — తనబులాకీ సొగసు చూసుకుంటూ, తనభర్త మనసు ఊహించుకుంటూ మురిసి పోవడం— రత్నం నిత్యకృత్యాలు.

కాని బంగారో ?..........

ఉదయం లేచేవాడు. చిక్కంలో సంగటి వేసుకుని ఆవుల్ని తోలుకుని చిట్టడవిలోకి వెళ్ళేవాడు. ఆవులన్నీ మేస్తూ వుంటాయి. బంగారు పిల్లనగ్రోవిని ఊదుతూంటాడు. ఆ పిల్లనగ్రోవి పాటకు ప్రకృతి అంతా పులకించి పోతుంది. ఆకులు కదలడం మానేస్తాయి. పిట్టలుకూయడం ఆపివేస్తాయి. పిల్లగాలి ఆపాట వినడానికి వేగం తగ్గించి వేస్తుంది. ఆ కొండల్లో, కోనల్లో అంతా బంగారు వేణుగానం మాత్రమే హాయిగా, మత్తుగా వినిపిస్తూ వుంటుంది. బంగారు బహుశా తన మనసులోని చల్లదనాన్ని, తియదనాన్ని మేళవించి పిల్లనగ్రోవి ఊదేవాడేమో ? ........

మధ్యాహ్నం కాగానే ఆవులు సెలయేటిపొడుగునా నిలబడి నీళ్ళుత్రాగి, అక్కడేవున్న మర్రిచెట్టు నీడలో మేనువాల్చి నెమరువేసుకుంటూ, మెళ్ళో మువ్వలు గలగలలాడిస్తూ వుండేవి. బంగారు సంగటి బయటికి తీసేవాడు. పిట్టలన్నీ చుట్టూ చేరేవి. బంగారు వాటికి కొంతవేసి, తాను కొంత తినేవాడు. సెలయేటిలో నీళ్ళుత్రాగి చెట్టుక్రిందికి వచ్చి కూర్చునేవాడు.

మరుక్షణం — ఆ మర్రిచెట్టు కొమ్మలపైకి పావురాలు, రామచిలుకలు, గోరువంకలు, కోయిలలు, అన్నీ వచ్చి వాలిపోయేవి. ఆవులు, అతని నాలుగు కాసలా

కుక్కలూ, పొదలలోనుండి కుందేళ్ళు, ఉడుతలు, సీతాకోకచిలుకలు, నెమళ్ళు అతని చుట్టూ మూగేవి ఎందుకో తెలుసా ?

బంగారు మంచి కథలు కోకొల్లలు చెప్పేవాడు.

ఒట్టి కథలేనా ?....నీతి కథలు !

ఆ నీతికథల ద్వారా ఎన్నో నీతులు, మంచి మాటలు చెప్పేవాడు.

అతడు చెప్పని నీతిఅంటూ లేదు. నీ తెలుగు పుస్తకంలోవుంది చూశావూ—నీతి పద్యాలు—అవికూడా చెప్పేవాడు. పోయిన యేడాది వాచకంలో నువ్వు చదువుకున్న నీతిపద్యాలు కూడా చెప్పేవాడు. అతడు చెప్పిన మరికొన్ని నీతులు యింకా ముందు తరగతుల్లో నువ్వుతప్పక చూస్తావు... ఇలా ఎన్నో చెప్పేవాడు. మధ్యమధ్య వేదాంతం కూడా చెప్పేవాడు. చెప్పడమే కాదు, తాను తు.చ. తప్పకుండా అన్నీ పాటించేవాడు. అందుకే బంగారంటే అంత ఇష్టము, గౌరవము ఏర్పడినాయి— పశుపక్ష్యాదులకన్నిటికీ. అతడు చెప్పే ప్రతిమాటా శిరసావహించేవి అవి. ఎల్లవేళల్లోను అతని బోధనలే మననం చేసుకునేవి.

అంతే కాదు !

అని బంగారును గురించి, అతని బోధనలను గురించి లోకమంతా ప్రచారం చేయసాగాయి. కోయిలమ్మ పాటలల్లింది. చిలుక కండచక్కెరవంటి పలుకులతో ఎలుగెత్తి చాటింది. కీచురాయి కమ్మని సీస పద్యాలల్లి గీపెట్టింది. పావురం కథలే ఏకరువు పెట్టింది. మలయ పవనం రాగమాలికలు ఆలపించింది. విన్నవాళ్ళ 'ఓహో' అన్నారు. స్వార్థంకంటే గొప్పది ఏదీలేదనుకున్న వాళ్ళు పెడచెవిని పెట్టారు.

## 2

బంగారు కథ అతడు నుడివిన బోధనలు చిట్టడవిని ఆనుకొనియున్న నీలికొండలమీదికి ప్రాకాయి. నీలికొండలకావల కీకారణ్యాలలోకి కూడా చొచ్చుకుపోయాయి. ఆ అడవిలో ఎన్నో జీవరాసులున్నాయి. లేళ్ళు, దుప్పులు, కణుతులు, కొండ గొర్రెలు, కుందేళ్ళు, కోతులు, ఎలుగుబంట్లు, ఏనుగులు, అనేక రకాల పక్షులు లెక్కపెట్టలేనన్ని ఉన్నాయి. అవన్నీ బంగారు నీతులువిని ఆనందంతో పరవసించాయి. ఆనీతులు వాటికి నచ్చాయి. మనస్సులో పదిల పరచుకొన్నాయి. తమ నిత్యజీవితంలో ఆచరణలో పెట్ట సాగాయి.

ఆ అడవిలో ప్రతిరోజూ ఏదో ఒక వేడుక జరిగేది. కోయిల పాటకచ్చేరి చేసేది. తన తీయని గొంతుతో బంగారును కీర్తించేది. తేనెవాగులవంటి నీతిపాటలు పాడేది. అడవిలోని జీవాలన్నీ ఆపాటలునేర్చుకున్నాయి. రామచిలుక కాళ్ళకు గజ్జెకట్టి మెడలో దండలు ధరించి, రెక్కలతో చిటికలువేస్తూ కథాగానం చేసేది. ఆకథలన్నీ జీవరాసులు విని తమపసిపాపలకు చెప్పేవి. అప్పుడప్పుడు అడవిలో నాటకాలుకూడా జరుగుతుండేవి. గౌతమబుద్ధ, సత్యహరిశ్చంద్ర, శిబిచక్రవర్తి, రంతిదేవుడు, రామాయణం, నలదమయంతి మొదలైన నాటకాలన్నీ జరిగేవి. నటించగల ప్రతిభవున్న ప్రతిపక్షి, ప్రతిజంతువు తమకు తగిన వేషాలు ధరించేవి.

క్రమంగా అరణ్యమంతాఒకపవిత్ర భూమిగామారిపోయింది. ఎక్కడచూచినా మంచిమాటలే ! ఎక్కడచూచినా మంచిచేతలే ! ఎవరిలో చూచినా మంచి ఉద్దేశాలే! చెడు అన్నమాటకు ఆ అరణ్యంలో తావేలేకపోయింది. దొంగతనము, మోసము, ప్రాణభయము, అత్యాచారము అన్నీ అంతరించిపోయాయి. ఆ అరణ్యం ప్రతిఅంగుళం మేరలోను శాంతి, ప్రశాంతి, సంతృప్తి కాపురం చేయసాగాయి. అడవిలో ప్రశాంతతకు భంగకరమైన గొడవ ఏదీ జరిగేది కాదు. అక్కడి ఆకాశంలో గట్టిగా ఉరమడానికైనా ఉరుము భయపడేది. నీలికొండల మీదిరాయి క్రిందికి దొర్లడానికి వెరచేది. ఎక్కడినుంచో పరిగిడివస్తున్న తుఫాను అడవి దగ్గరకురాగానే అడుగు కదపలేక ఉడబడేది. వెదురుబొంగుల సందులో పుట్టిన కార్చిచ్చు అక్కడికక్కడే చల్లారిపోయేది. ఎంతలోఎంత మార్పు !.... ఆ అరణ్యంలోని జీవరాసులన్నీ మంచివి. మంచివారిని నాశనం చేసేశక్తి, సాహసం ఎవరికున్నాయి ?

"ఇదంతా బంగారు చలవ! ఎంతచల్లని హాయైన బ్రతుకునిచ్చాయి అతని మాటలు! బంగారు ఎక్కడివాడో, ఎలావుంటాడో, అయితేనేం ? అతడు తన సూక్తులద్వారా మన గుండెల్లోనే వుంటున్నాడు. మనకన్నుల్లోనే మెదులుతున్నాడు. బంగారు మనిషి కాదు. దేవత !...లోకానికి శాంతి ప్రబోధం చేయ వచ్చిన శాంతిదూత !"అనుకున్నాయి అరణ్యంలోని జీవాలు.

ఆ అరణ్యంలో ఒకపెద్దపులి ఉండేది. దానిపేరు సర్వమంగళం ! దానిపేరు ఎంత సరళమో, దాని హృదయం అంత కఠినం. అది ఆ అడవికంతా రాజు ! అదికూడా చిలుకపలుకులు, కోయిలపాటలు వింటూనే ఉంది. తనరాజ్యంలో జరిగే మార్పంతా చూస్తూనే ఉంది. అదితన జీవితంలో ఎన్నో ఘాతుక కార్యాలు చేసింది. ఎన్నోజంతువులను తనపొట్టన పెట్టుకుంది. ఇప్పుడు ముసలిదైపోయింది. పరుగెత్తి వేటాడే ఓపిక క్రమంగా సన్నగిల్లిపోతున్నది. దానికెంతో బంగారు బోధనలపట్ల కుతూహలం కలిగింది. తనకు, బంగారుకు తూర్పు పడమరలంత తేడావుంది. తన రాజ్యంలో ప్రజలంతా బంగారును దేవుడంటున్నాయి. తనను రాక్షసుడని వారు భావింప వచ్చునుకదా ?

ఒకనాడు— అడవిలోని జంతువులను సమావేశపరచవలసిందని తన నేస్తమైన గ్రద్దతో చెప్పింది పులి. గ్రద్ద రివ్వున ఆకాశాని కెగిరి, అడవియంతా వలయాలుతిరుగుతూ "పులిరాజు జంతువుల నన్నిటినీ సమావేశం కమ్మంటున్నారహో !" అంటూ దండోరా వేసింది. ఈ దండోరావిని జంతువులన్నీ గుండెలుఅరచేతిలోపెట్టుకునిఅరణ్యమధ్యంలోసమావేశమైనాయి. అసమావేశ మధ్యేతీరు తమాషాగా ఉంటుంది. పులిరాజుకు అందుబాటులో ఏ జంతువూ నిలబడదు. ఎలుగుబంట్లు చెట్లమొదళ్ళలో నించున్నాయి.. ఏనుగులు చూపులు పులిరాజు మీదనే కేంద్రీకరించి, చెవులు వెనక్కి రిక్కించి, తొండాలు పైకెత్తి నిలబడ్డాయి. కుందేళ్ళు పొదలమాటు నుంచి తొంగిచూస్తున్నాయి. దుప్పులు, లేళ్ళు, కణుతులు దూరంగా రాళ్ళవెనుక— పులిమీదికి దూకితే పరుగందుకునేంత హుషారుగా నుంచున్నాయి. కోతులు చిటారు కొమ్మలమీద కూర్చున్నాయి పక్షులన్నీ ఆకులపరదాల్లోంచి క్రిందికి నిక్కి చూస్తున్నాయి.

**పిల్లల సీరియల్ ప్రారంభం!**

పులి— మధ్యలో ఎత్తైన ప్రదేశంలో కూర్చున్నది. దానిముఖం విచారంతో నిండివుంది. కొంతసేపు అడవిలో ఆకురాలితే వినిపించేంత నిశ్శబ్దత నెలకొంది. పులిహఠాత్తుగా బావురుమంటూ ఏడువసాగింది. దానిరొమ్ములు వెక్కిళ్ళతో ఎగిరెగిరిపడ్డాయి. చెంపలమీద కన్నీరు కాలువలు కట్టింది. జంతువులలో సంచలనం బయలుదేరింది. "పులిరాజు ఏడుస్తున్నాడు!..పులిరాజు ....ఏడుస్తున్నాడు!......" అంటూ ఆశ్చర్యపోయాయి.

"సోదరులారా !" అన్నది సర్వమంగళం.

మళ్ళీ నిశ్శబ్దత వ్యాపించింది.

"సోదరులారా ! నేను మహాపాపిని ! ఇన్నాళ్ళు— మీరంతా నాసోదరులన్నమాట మరిచిపోయాను. నా నికృష్టపు కడుపుకోసం ఎందరు సోదరులు బలైపోయారో తలుచుకుంటే— నాగుండె నీరైపోతున్నది. ఇంత కాలమూ— స్వార్థంలోపడి కొట్టుకులాడాను. మిమ్మల్ని కన్న తండ్రిలా పాలించవలసిన నేను మీపాలిట మృత్యువుగా బ్రతికాను. ఈనాడు— మహానుభావుడు బంగారు నాకళ్ళు తెరిపించాడు. నా తప్పు నాకు తెలిసి వచ్చింది. నాహృదయం పశ్చాత్తాపంతో రగిలిపోతున్నది. జీవితం మీద రోతపుట్టింది. వచ్చి పోవాలనుకున్నాను. మిమ్మల్ని రెండు కోరికలు కోరుతున్నాను. నా పాపాలను క్షమించామనండి. తరువాత మీరందరూ కలిపి నన్ను చీల్చి చెండాడేయండి. ఈలోకంనుండి తృప్తిగా వెళ్ళిపోతాను...." అంటూ కడివెడు కన్నీరు కార్చింది సర్వమంగళం.

జంతువులు పొందిన ఆశ్చర్యం యింతాఅంతా కాదు. ఇదేమి వింత! పులిరాజేనా యిలా మాట్లాడుతున్నది. దయ, ప్రేమ ఏ కోశానాలేని తమరాజేనా ఈమాటలంటున్నది. ? అవినమ్మలేక పోయాయి. ఆశ్చర్యంతో కళ్ళు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయాయి.

పులిరాజు రోదిస్తూనే ఉన్నాడు. తన పాపాలకు పశ్చాత్తాపం వెలిబుచ్చుతున్నాడు. "నన్ను క్షమించామని ఒక్కసారి అనరా ? ఈ నీచ జన్మనుంచి నాకు ముక్తిని ప్రసాదించరా ? ........"

"క్షమించా"మని ఏజంతువూ అనలేదు. పులి చంపమంటున్నా దాన్ని చంపడానికి అవి ప్రయత్నించలేదు. పులిమాటలు నమ్మవచ్చునా, నమ్మకూడదా—అని అవి నిర్ధారణ చేసుకోలేకపోతున్నాయి.

రెండు రోజులైనా పులి కూర్చున్న చోటునుంచి కదల్లేదు. ఆరెండు రోజులూ దానికి ఆహారం కూడా లేదు. దాని ఆవేదన చూచి జంతువుల మనస్సులు ఎండపొడ తగిలిన మంచుగడ్డల్లా కరుగసాగాయి.

"సోదరులారా ! నన్ను క్షమించామనరా ? అయ్యో ! ...మీరే నన్ను మన్నించలేకపోతే— నాకిక పుట్టగతులుంటాయా ?. ..దేవుడా !..నన్ను క్షమించు !.... ...నన్ను క్షమించు !...అంటూ సర్వమంగళం మూర్ఛపోయింది.

జంతువులకు తమ రాజు మీద జాలికలిగింది. "పాపం ! పులి చేసిన పాపాలు దాన్నిప్పుడు యిలా దహించి వేస్తున్నాయి. అది పశ్చాత్తాపం చెందుతున్నది. దాని మనస్సు నిజంగానే మారిపోయింది.

45 వ పేజీ చూడండి



# మీకు నమ్మకం ఉందా?

సమ్మోహనకరంగా వున్నారు, నిజమే. అందంగా అలంకరించుకున్నారు. చదువులో కూడా మీరు ముందే. కాని మీరు యితరులకు అంగీకారమైన వ్యక్తా?

శరీరంపై దుర్గంధం గొలిపే క్రిములు లేకుండా మీరు చేయలేరు. కాని, క్రమం తప్పకుండా సింథాల్ వాడకంద్వారా వాటిని మీరు తప్పక నిర్మూలించగలరు. మహాద్భుతంగా క్రిముల సంహార కారిణిగా పేరొందిన జి-11* కలిగివున్న సబ్బు ఇండియాలోకెల్లా ఇది ఒక్కటే కోట్లాది వాడి. పరీక్షించి అంగీకరించిన సత్యం. మీ పేరు చాలావరకు దీనిమీదే ఆధారపడి వుండగలదు.

సువాసనగొలిపే సింథాల్ దుర్గంధం గొలిపే క్రిములను సంహరించి, మీ శరీరచ్ఛాయకు వన్నె తెస్తుంది.



సింథాల్ సబ్బుతో స్నానంచేసిన అనంతరం అతి కమ్మని వాసననిస్తూ, క్రిమి సంహారక గుణం కల జి-11 కలిగివున్న సింథాల్ టాయిలెట్ పౌడర్ను వంటిమీద చల్లుకుంటే మరింత రక్షణ.

* ఎల్. గివోడా కంపెనీ యొక్క ట్రేడ్ మార్కు.

* "జి-11 ఏమిటి" అనే ఉచిత సలహా పుస్తకంకోసం 'గోద్రెజ్', బొంబాయి-12'కు వ్రాయండి.







Godrej గోద్రెజ్ సబ్బులలో మేలైన దానిపేరు

CT. 10A. TEL.

## మా సింథాల్ సబ్బు కొనేవారికి ప్రత్యేక సదుపాయం!

సబ్బుపైన చుట్టబడివున్న పల్చని కాగితములోపున డిస్కౌంట్ కూపన్ మీకు కనిపిస్తుంది. ఈ కూపన్‌తో సింథాల్ టాయిలెట్ పౌడర్‌ను మీరు అసలు ధరలో 30 పైసలు తగ్గించి కొనవచ్చు.


నేనిన్ను ప్రేమిస్తున్నాను
కాని నీకుక్కను కాదు
విధానం
జాన్సన్ విజయం
యుద్ధ
జాతి విచక్షణ
మాకు ఆహారం కావాలి
ఇదిగో ఆర్డినెన్సు
తప్పు ప్రణాళిక
దొంగనిలవ
ద్రవ్యోల్బణం
అధిక ధరలు
OOMMEN

**న్యూ ఢిల్లీ లేఖ**

# పరిపాలనలో మందకొడితనం

# ప్రభుత్వ పెద్దల ఆత్మపరిశీలనం !

**ప్రణాళికాసంఘంవారు, తమ తప్పొప్పులను తెలిసికొనేందుకు, యీ ఏడాదిలో మరోమారు ఆత్మపరిశీలనం జరుపుకొన్నారు !**

గత వారంలో రెండు రోజులపాటు జరిగిన 'జాతీయ అభివృద్ధి మండలి' సమావేశంలో ప్రణాళికాసంఘం ఆధ్వర్యాన ఇందుకు సంబంధించిన కాగితాలను పంచిపెట్టటంకూడా జరిగింది. మొత్తం మీద, పై ఆత్మపరిశీలనంద్వారా, తృతీయ ప్రణాళికలోని అవకతవకల జాబితా సుదీర్ఘంగా తయారయింది. అందులోని కొన్ని అంశాలు :

* తృతీయ ప్రణాళిక లక్ష్యాలు, వాటి ఆచరణ సాధనాలకు, సాంఘిక లక్ష్యాలకు మధ్య పెద్ద అఘాతం ఉండటం —

* ప్రస్తుతపు ఆర్థిక సాంఘిక విధానాలకు, ప్రణాళికా విధానాలకు, లక్ష్యాలకు పొత్తు కుదరకపోవటం.

# లోపభూయిష్టమైన మనప్రణాళికలు !

* రాష్ట్రాల పరిపాలనలోని బలహీనతలవల్ల, మొత్తంమీద ఫెడరల్ విధానం వల్ల పుట్టుకొస్తున్న సమస్యలు,

* ప్రణాళికలతో పోల్చి చూసినపుడు, ఇతర నిర్వహణ విభాగాలపట్ల చాలీచాలని శ్రద్ధ,

* ఊహల కందని లక్ష్యాలను ఏర్పరచుకోవటం.

* ప్రాజెక్టులకు, వాటిని అమలుజరిపే పథకాలకు మధ్య సమన్వయం కుదరకపోగా, విపరీతమైన కాలహరణం ఏర్పడటం—

* సమర్థవంతమైన పరిపాలన, సాంకేతిక సహకారాల ఫలితంగా ఉత్పన్నమయ్యే సమస్యలు.

* అధిక ధరలు, ఉత్పత్తులు, ఫలితాలు — మొదలైన అంశాలపట్ల అవసరమైనంత శ్రద్ధ చూపకపోవటం —

* ప్రణాళికాయుతమైన అభివృద్ధి, ప్రైవేటు రంగాల సామరస్యం, ప్రైవేటురంగను బాధ్యత ఇది నిర్వహించే పాత్రల్లోని బలహీనతలు.

* ప్రణాళికలు సాధించిన ప్రగతినీ, వాటి లోపాలను సరిగ్గా అంచనాలు వేసుకొనకపోవటం.

* వేర్వేరు స్థాయిలలో, ప్రణాళికా పథకాలను అమలుజరపటంలోగల అవకతవకలు.

ఈ 'ఆత్మ పరిశీలనం' ప్రకారం మనం ఏర్పరుచుకున్న సాంఘిక లక్ష్యాలకు, వాటిని అందుకొనేందుకు మనకున్న శక్తి సామర్థ్యాల ప్రకారం సమన్వయం కుదరలేదన్న వాస్తవం ఋజువయిపోయింది. తత్ఫలితంగా 'ప్రణాళికాయుతమైన ప్రగతి' అన్న అంశాన్నే శంకించక తప్పటంలేదు.

దేశంలోని అన్ని రంగాలలో, సామాన్యునికి సమానమైన అవకాశాలు కల్పించాలన్నదికూడా మన లక్ష్యాలలో ఒకటి. ఆర్థిక వ్యత్యాసాలు తొలగాలని అంటారు. కాని, ప్రణాళికలు ఎంతవరకు ఈ లక్ష్యాలను సిద్ధింపచేశాయో, వేరే వివరించనక్కరలేదనుకొంటాను. ఆర్థిక ప్రగతిని సాధించి, సాంఘిక న్యాయం చేకూర్చటానికి బదులు ప్రణాళికా కాలమంతా అనిశ్చిత స్థితిలోనే గడుపుకోవటం జరిగింది. ఈ కాలంలో జరిగిన ప్రగతి శూన్యం. అంతటితో ఆగక, మనం తీసుకున్న చర్యలకూ, మనం అమలుజరపవలసిన విధానాలకు మధ్య భారీఎత్తున సంఘర్షణ రావటంకూడా గమనార్హమే.

నిర్దుష్టమూ, సమర్థవంతమూ అయిన పరిపాలనకు ముఖ్యావసరమైన క్రమశిక్షణ(విధానాల్లో) కొన్ని ప్రధానమైన రంగాలలోనే, సన్నగిల్లిపోయిందని ప్రణాళికా సంఘంవారి 'ఆత్మపరిశీలన'మే ధృవ[illegible]సక తప్పలేదు. [illegible], ఈ లోపాల్ని నాలుగవ ప్రణాళికకు ఒక చక్కని గుణపాఠంగా తీసికోవాలి. పై లోపాల్ని సరిదిద్దుకొంటూ, ప్రణాళికా అంశాలను ఏ రాష్ట్రమూ నిర్లక్ష్యంచేయకుండా చూచుకొంటే మనం మరో అడుగు ముందుకు వేసినట్లే!

సాధారణంగా ప్రతిసారీ జరిగే తప్పు మరొకటి ఉంది. 'అంత సాధిస్తాం, ఇంత సాధిస్తాం' అనుకొంటూ పెద్ద పెద్ద లక్ష్యాల జాబితాలు తయారుచేసుకుని, కొంతకాలంపోయాక మనం ఖర్చుచేసిన మొత్తాల సంఖ్యనుబట్టి మనం సాధించిన దానిని అంచనా వేసికోవటం తప్పుకాక మరేమవుతుంది ?

జరగవలసిందిది !...... ప్రణాళికాయుతమైన అభివృద్ధిని మనం వెచ్చించిన డబ్బు దృష్ట్యా కొలత వేయకూడదు. అసలు, మనం అనుకొన్న కార్యక్రమాల్లో ఎన్ని నెరవేరాయో, ఎన్ని మూలబడ్డాయో చూచుకోవాలి. ఖర్చుఅయిన డబ్బుకు, పూర్తి అయిన పనులకు సామ్యం ఎంత ఉందో చూడాలి! ఇదీ నిజమైన ప్రగతి. అందరూ అనుకొనేటట్లు లక్షలు లక్షలు ఖర్చుచేయటం ప్రగతి చిహ్నం కాదు.

ఫలానా పథకాన్ని తలపెట్టారు. అనుకున్న గడువులోగా అది పూర్తికాకపోతే, అది నిశ్చయంగా ప్రణాళికా కర్తల వైఫల్యమే ! నిర్వహణలో పెద్ద లోపం జరిగిందన్నమాటే !

మొత్తం మీద పథకాలను రూపొందించటమూ, నిర్వహణా— సరిగ్గా ఉంటే లోపాలకు ఆస్కారం

పరుస్తున్నది. నేషనల్ డెవలప్‌మెంట్ కౌన్సిల్‌తో బాటు, మరికొన్ని రాజకీయ అవకాశాల చేయూత లభించినా, గత కొంది సంవత్సరాలుగా ప్రణాళికల పరిధిలో అసంతృప్తికర వాతావరణం వ్యాపించే ఉన్నది.

ప్రణాళిక లక్ష్యాలు, విధానాలు ప్రస్తుతపు విధానాల మధ్యన ఉన్న అగాధం ధర్మమా అంటూ ప్రణాళికలు సమర్థవంతంగా అమలు జరిగికపోగా, పరిపాలనకూడా లోపభూయిష్టమైంది.

మరో సంగతి : దేశాన్ని సక్రమంగా నడిపించటానికి 'ప్రభుత్వం' అనే యంత్రాంగం చేతిలో కొన్ని హక్కులు, అధికారాలు ఉన్నాయి. ఇవన్నీ కేంద్రం, రాష్ట్రాల మధ్య సరిగ్గా సంపిణీ జరగలేదన్న అపవాదు ఒకటి వినవస్తున్నది.

బహుశా, అందువల్లనే ఏమో, దేశంలో సాంఘిక ఆర్థికరంగాల్లో బహుముఖ ప్రగతిని సాధించటం మన వ్యూహకుమించిన పని అయిపోయింది. కనీసం ఈ లోపాలను అయినా సరిదిద్దగలమన్న చివరి ఆశతో ప్రణాళికలను రూపొందించటం జరిగింది. కేంద్రమూ, రాష్ట్రాల మధ్య సామరస్యం లోపించినపుడు ఎంతటి ప్రణాళికలయినా, పటాపంచలు కాకమరేమవుతాయి?

ఈబాలారిష్టపు దోషాలన్నీ తృతీయ ప్రణాళికలో ప్రస్ఫుటంగా వెలుగులోకి వచ్చాయి. చాలీచాలని, లోటు బడ్జెట్లతో రథాన్ని లాగుతున్న రాష్ట్రాలు కొన్నింటిలో ప్రణాళికలు మరీ బాగా దెబ్బ

ఎందుకు ఉంటుంది ?

ఆమధ్య ప్రణాళికాపెద్దలు ఓ సమాధానం చెప్పారు: విదేశీ మారక ద్రవ్యం లభించటంలోగల సాధక బాధకాలమూలంగా పథకాలు అమలు జరగటానికి అనుకున్న కాలంకంటే ఎక్కువ సమయం తీసుకొంటున్నదట ! అది కాదనం. కాని, ఏ పనిచేయాలన్నా, 'విదేశీ మారక ద్రవ్యం' నెపంగా పెట్టుకొంటే ఎలా ?

ప్రణాళికల ఫలితంగా పెరుగుతాయనుకొంటున్న ఉత్పత్తులకూ, ఉత్పత్తులద్వారా స్థిరీకరణ చెందవలసిన ధరలకూ ఎంతో సాన్నిహిత్యం ఉన్న కారణం దృష్ట్యా, ప్రణాళికల ప్రాధాన్యతను వూహించవచ్చును.

**ఈ లోపాలన్నీ సరిదిద్దుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. నాలుగో ప్రణాళికకు సన్నాహాలు చేసికొంటున్న యీ తరుణంలోనైనా మన లోపాలను గ్రహించుకోలేకపోతే, ముందెన్నడో గ్రహించినా లాభం శూన్యమే అవుతుంది !**

— శ్రీ కృష్ణ ★




ఒక అందమైన లేడి ఓ సాయంత్రం తీరుబాటుగా షికారుకు బయల్దేరింది. కొంతదూరం వచ్చాక దానికి 'ఝూామ్' అనే శబ్దం వినపడింది. ఏదైనా శత్రువేమోనని భయపడింది. చుట్టూ చూసింది. ఏ జంతువూ వస్తున్న అలికిడి అవలేదు. మరి కాస్త పరకాయించి చూసేసరికి ఒక గుబురులో కొన్ని వందల కందిరీగలు ఒకచోట గుమిగూడి సంగీతం పాడుతున్నాయి. ఆ ప్రదేశం అంతా వాటి శరీరం రంగు ముద్దలా వుంది. లేడికి భలే సంతోషం వేసింది. అక్కడే ఓ అనువైన చోటు చూసుకుని, కూర్చుంది. ఆ గొడవ చక్కని సంగీత ధ్వనిలా వినిపించసాగింది.

ఇంతలో ఎక్కడనుంచి వచ్చిపడిందో ఒక మాయదారి పెద్దపులి వచ్చిపడింది. పరాకుగావున్న లేడిని వాటేసిపట్టుకుని, "నా అదృష్టం. లేడి మాంసం యీరోజు నాకు ఆహారం" అంది అంతులేని ఆనందంతో.

లేడికి మంచి వూహా తట్టింది. భయపడడానికి బదులు ఫెళ్లున నవ్వింది. "నన్ను చంపితే నీచావు నువ్వే తెచ్చుకున్నట్టవుతుంది" అని మళ్లీ నవ్వింది.

"ఎందుకని?" అంది పెద్దపులి.

"అటు చూడు. ఆ నల్లని సంగీత గంటని నేను కాపలా కాయాలి. ఇది సోల్మన్ రాజుగారి ఆజ్ఞ. కనుకనే నేనిలాకూర్చున్నాను. నన్ను చంపితే ఆయన వెంటనే నిన్ను చిత్రవధ చేస్తారు" అంది. పులి పట్టు సడలించి లేడి చెప్పినవైపు చూసింది.

"అలా చూస్తావేం రఘుమ్మనే చక్కని శబ్దం నీకు వినిపించటం లేదా? ఆ గంటమీద గనుక చిన్నగా తట్టితే వింత వింత స్వరాలు వస్తాయి తెలుసా" అంది లేడి. పులికి ఆ గంట మీదతట్టి, స్వరాలు వినాలనే కోర్కె కలిగింది. లేడిని బ్రతిమాలింది. లేడి ససేమిరా అంది. లేడి వద్దన్నకొద్దీ పులికి కోర్కె ఎక్కువ అయ్యింది. "బాబూ, నా బంగారు కొండవిగా. చిన్నగా ముట్టుకుని చూస్తానంతే" అంది బ్రతిమాలుతూ.

లేడి ఓ క్షణం ఆలోచించి, "అయితే ఓపని చెయ్. నువిక్కడేవుండు. నేను వెళ్లి సోల్మన్ రాజుగారి అనుమతి తీసుకువస్తాను. నేనడుగుతే ఆయన తప్పక సమ్మతిస్తారు. అంతవరకూ నువ్వు కూర్చోవాలి. అనుమతి లేనిదే ముట్టకుంటే నీతలకేముప్పు" అని చెప్పింది. లేడి చెప్పినట్లు పులి వప్పుకుంది. లేడిని వదిలేసింది. లేడి హాయిగా గాలి పీల్చి "జాగ్రత్త" అని చెప్పి ఛంగున ఎగిరి కూతవేటు

## లేడిపిల్ల తెలివి

దూరానికి పరిగెట్టి అక్కడ నిలబడి, "మిత్రమా! సోల్మన్‌రాజుగా రొప్పుకున్నారు. నీ యిష్టం వచ్చినంత గట్టిగాకొట్టు" అనరిచింది.

పులి అంతుమీరిన ఆనందంతో ఎగిరి, పంజాతో ఒక్క దెబ్బకొట్టింది. అంతే! కందిరీగలు విజృంభించాయి. పులి శరీరాన్ని తూట్లుగా కుట్ట నారంభించాయి. పులి లబో దిబో మంది. అరణ్యం ఎగిరేలా అరిచింది. కందిరీగలు పులిని వదల్లేదు. పులి చివరికి ఎగిరి ఒక మడుగులోదూకి, తలవరకు మునిగింది. కందిరీగలన్నీ చచ్చాయి. కాని శరీరమంతా పాపం కన్నాలే! తూట్లుపడిపోయింది. రక్తం విపరీతంగా కారుతోంది. పులి బాధగా మూల్గింది.

గట్టుమీద నిలబడ్డ లేడి ఫక్కున హేళనగా నవ్వింది. పుండుకు కారం రాసినట్టయింది పులికి. కోపంతో లేవబోయింది. కాని లేవలేక పోయింది. పళ్లు పటపటలాడించి, "సరిలె ఈసారికి పట్టి కొట్టించి పారిపోయావు. వచ్చేసారికి ఎలా తప్పించుకుంటావో చూస్తాను. నీ ఎముకల్ని మాంసంలో నంచుకు మరీ తింటాను" అంది కసిగా. ఆనక బాధగా మూల్గింది.

లేడి జాలిగా నవ్వింది.

"భయపడకు మిత్రమా. వచ్చేసారి యింతకుమించిన ఎత్తు మరోటి వేసి, నీ పొగరు మళ్లీ అణుస్తాను. వస్తా వొళ్లు జాగ్రత్త" అని వెటకారంచేసి, ఝుమ్మని పరిగెట్టుకు పోయింది.

"సోల్మన్ రాజుగారి సంగీతపు గంట పులిరోగాన్ని మాబాగా కుదిర్చింది" అని తన తెలివికి తనే ఆశ్చర్యపోయింది. భూపతి★




## జరిగిన కథ

విభిన్న మనస్తత్వాలు గల అయిదుగురు అమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయనకు మద్రాసులో వాచీల వ్యాపారం. రామయ్యగారి స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాసు చూడటానికి వచ్చి వాళ్లింట్లో దిగుతాడు. అమ్మాయిలందరూ అతని వాలకాన్ని రెండురోజులపాటు గమనించి త్వరగా సాగనంపటానికి పలువిధాల ప్రయత్నాలు చేస్తారు. కాని అవేవీ సుధాకర్ మీద పని చెయ్యవు. కళ ముభావంగా ఉంటం చూసి సుధాకర్ కలవర పడ్తాడు. అతని మిత్రుడు మోహన్‌తో ఆలోచించి ఇంటికి తీసుకెళ్తాడు. అక్కడ అతనికి గీతతో పరిచయమౌతుంది. రామయ్యగార్ని చూసిన మోహన్ పారిపోతాడు. ప్రభాకర్‌ను పేరుపొందిన హస్తసాముద్రికునిగా తనతండ్రికి పరిచయం చేస్తుంది ఉష. ఆయన ఆప్యాయంగా తమయింటికి ఆహ్వానిస్తాడు. ప్రభాకర్ ప్రయాసపైన సమ్మతిస్తాడు. రోజూ లైబ్రరికి వెళ్లి అతి కష్టం మీద హస్తసాముద్రికం పుస్తకాలన్నీ చదివి రామయ్యగారికి నచ్చేనట్లు సాముద్రికం చెప్పాడు. మోహన్ గీతను ప్రేమిస్తున్నట్టు సుధాకర్ తెల్సుకుంటాడు గీతవాళ్ల మేనత్తగారింటికి వైజాగ్ వెళ్లాలని తన స్నేహితురాల్తో చెప్పటం మోహన్ వింటాడు. పెద్దల అంతర్యాలకి భిన్నంగా శేఖర్ శారదచే ఆకర్షింపబడతాడు.

(గత సంచిక తరువాయి)

కళకు ఉత్తరం వ్రాయాలని అనేకసార్లు ప్రయత్నించాడు, కాని చేతకాలేదు....అసలు కళకు తనంటే ఇష్టమున్నదో, లేదో ? తీరా తన ఉత్తరం తీసుకెళ్లి తండ్రికి చూపిస్తే......? రామయ్యగారసలే చండశాసనులు........మొదటికే మోసం వస్తుంది.

తన బాధకు మందేమైనా ఉంటే అది మోహన్‌కే తెలియాలి !

అందుకే ఒకరోజు సుధాకర్ తన బాధనంతా వెళ్లబోసుకుంటూ మోహన్‌కో ఉత్తరం వ్రాశాడు.

"డియర్ మోహన్ !

నీకు ఉత్తరం రాయాలని కూర్చున్నానేకాని ఏం రాయాలో తోచటంలేదు. ఎందుకంటావా ఆలోచించిపెట్టే మనస్సులేదు.. అది నన్ను వదిలేసి కళ వెంట వెళ్లిపోయింది.......

నాన్నగారు నా పెళ్లి విషయం ఎత్తారు. ఏం చెప్పను ? కళకు బావగాడున్న సంగతి తెలిస్తే మనస్సునా అదుపులో పెట్టుకునేవాడిని....ముక్కూ ముఖం తెలియని మనిషిమీదకంటే చిన్నప్పటి నుంచి కలిసి మెలిసి తిరిగిన బావంటేనే ఎవరికైనా ప్రేమ ఉంటుంది. ఏమంటావ్ ? ఇప్పుడింక దేవదాసులా ఏ తాగుబోతు వెధవనైపోతానో అని భయంగా ఉంది.

నా ఆశ ఎలాగూ ఫలించేదికాదు......నువ్వైనా సుఖపడాలని ఆశిస్తున్నాను ....... గీతను తరచు కలుసుకుంటున్నావా ? వాళ్ల సంగతులు లేమిటి ? జవాబు వ్రాస్తావుకదూ ?"

నీ
సుధాకర్."

ఉత్తరం పోస్టుబాక్సులో వేసివచ్చాక సుధాకర్‌కు కొంత బరువు తగ్గినట్టు అనిపించింది. మోహన్ తనను ఆదుకోగలడనేనే ధైర్యం వచ్చింది. దాంతో ఆ రాత్రి సుధాకర్‌కు ఇటీవల ఎన్నడూ ఎరుగనంతటి సుఖంగా నిద్రపట్టింది.

"అమ్మా ! తేలొచ్చిందే ?" అంటూ శేఖర్ గట్టిగా అరిచాడు వీధి వరండాలో నుంచి లోపలి కొస్తూ. సాలిట్లో కూర్చుని మాట్లాడుకుంటున్న అమ్మాయిలంతా "అమ్మో !" అంటూ కంగారుపడి నిలబడి పోయారు భయంగా గదంతా చూస్తూ.

శేఖర్ అమ్మాయిల వంక అదోలా చూసి నవ్వాడు.

ఇంతలో జయమ్మ లోపలి నుంచి వచ్చి "ఎప్పుడొచ్చావే తేలూ ? కులాసా ?" అని పలకరించింది.

మనిషిపేరు తేలేమిటని అమ్మాయిలంతా పక పక లాడారు ఇప్పటికి బెంగ తీరి.

చింకి గంపలాంటి జుట్టు, మాసితోలై కంపు కొడుతున్న చీర, జాకెట్టు, పొట్టిగా లావుగా ఉన్న పాతికేళ్ళలోపు పడుచు నవ్వుతూ జవాబిచ్చింది. "అంతా మీ దయమ్మా ! బాగానే ఉండాను."

అమ్మాయిలకేసి తలతిప్పి "ఇందులో కోడలమ్మ గారే రమ్మా ?" అనడిగింది తేలు. కళ గుండెలు కలుక్కుమన్నాయి. గదిలో నుంచి బైటికి తప్పించుకుని వెళ్తున్న శేఖర్‌ను చూసి నవ్వింది జయమ్మ. కళ దగ్గరకెళ్ళి చేతో పట్టుకుని "ఇది మా కోడలు! బాగుందా ?" అన్నది. కళ మరోక్షణం అక్కడ నిలబడలేదు.

"బంగారం బొమ్మలా ఉన్నారమ్మా !" అంది తేలు.

"మీ వదినకు సాయం చేద్దామని వచ్చావటే ? వూరి నించి ఎప్పుడొచ్చావ్ ?" అంటూ కుశల ప్రశ్నలు వేసింది జయమ్మ.

"రెండు రోజులైనాదమ్మా. . . అంట్లు కడెయ్యండమ్మా. తోమేసి పోతాను." అంది పెరట్లోకి దారితీస్తూ.

వంకర టింకరగా వ్రేలాడుతున్న తేలుజడ చూస్తే చిత్రకు నవ్వాగలేదు. అందుకని పక్క గదిలోకి పరిగెత్తింది.

చావడి తర్వాత మరోగది, ఎడమ వేపున మూడు గదులు, అవిగాక ప్రత్యేకంగా వంటిల్లు, బాత్‌రూం—ఇద్దరు మనుష్యులకు చాలా పెద్దదే అయినా జయమ్మ ఇల్లంతా తన క్రిందే ఉంచుకున్నది. అద్దెకివ్వకుంటేనే కాని గడవని పరిస్థితి కాదు.

ఎడమవేపు గదుల్లో మొదటిది శేఖర్ వాడుకునేది. పనిమనిషి పైడమ్మ గది తుడుస్తున్నది. పనివాళ్ళు ఎవరైనా దగ్గర లేపోతే శుభ్రంగా తుడవరని, చేతి కందిన వాటిని మొలలో దోపుకు పోతారని కళ రోజూ పైడమ్మ గదులు తుడిచేటప్పుడు దగ్గరుండి మరీ తుడిపిస్తుంది. ఈ రోజు కూడా అలాగే పైడమ్మ వెంట ఉండి తుడిపిస్తున్నది.

తేలు పనిమనిషి పైడమ్మ ఆడబడుచు. పైడమ్మ తేలు మీద నేరాలు చెప్పటం ప్రారంభించింది.

"కళమ్మగోరూ ! ఈ తేలు మా కానిదండి. దీనికి పోకులు మా లావు ! ఆడు కొప్పెట్టుకోమంటే టట్ అనేసి మా నెత్తిని కూకోడాని కొచ్చింది ! ఏటమ్మా ? పెళ్ళయ్యాక ఆడిష్టపెకారం ఉండాలా, వద్దా ?... ఇదంటే మా యజమానికి మా లావు ముద్దు ! దాని మాటే ఆడతాడు. అది ఏది కావాలంటే అది నిమిషాల్లో తెచ్చి పడేస్తాడు. నా మాటంటే కాతరేనేదు !. . ." అంటూ నిట్టూర్చి కాస్సేపు తుడవటం ఆపేసి "ఏటో తెండమ్మా !" అంది విరక్తిగా.

కళ మాట్లాడకుండా తలూపుతూ సానుభూతి ప్రదర్శించింది.

కొబ్బరి ఈనెల చీపురు— పైన కట్టు వదులై ఒకటి రెండుగా క్రింద పడుతున్న పుల్లలన్నీ లోపలకు దోపి పురికొసతో గట్టిగా కడుతూ అంది పైడమ్మ.

"మా ఇంటికాడ ఎంకయ్య బాబు లేడూ ? ఆ బాబు సేతులు సూసి మా బాగా సెప్తాడట మ్మాయిగోరూ ! నా సెయ్యి సదివి 'నీకే నోటునేదు పైడమ్మా ! సుకంగా రాజానాగా బతుక తావు ! అని సెప్పిండమ్మా. . ఈ జెన్మకి సుకమేటి ?" అంటూ నిట్టూరుస్తూ అరచేతులవంక చూసుకున్నది.

కళ ఉత్సాహంగా ముందుకు వంగి పైడమ్మ చేతి వంక తొంగి చూసింది. పైడమ్మ చేతిలో కత్తుల మాదిరిగా రెండు రేఖలు ఒకదాని నొకటి ఖండిస్తున్నాయి ! కళ ఆశ్చర్యంగా పైడమ్మ చెయ్యి పట్టుకుని దగ్గరగా చూసింది.

"పైడమ్మ చెయ్యి స్టడీ చెయ్యటం మొదలు

పెట్టా వేమిటి ? నాన్నగారిలా నీకు జాతకాల పిచ్చి పట్టుకున్నదీ ?''

కళ తలెత్తి చూసి నవ్వింది.

''అది కాదే చిత్రా ! పైడమ్మ చేతిలో క్రాసుందే అంటే లవ్ మేరేజ్ ని ఆయన చెప్పాడు కాదటే ?''

పైడమ్మకేం అర్థం కాలేదు. ఒక చేతిలో చీపురు కట్ట ఉంది కాబట్టి రెండు చేతులతో తల గోక్కోవటానికి వీలుగాక ఒక చేత్తో తలను గబగబా గోకింది అసలే పీకేసినట్టున్న తల మరి కాస్త గజిబిజిగా అరణ్యంలా తయారయింది. ఆ అరణ్యంలోని జంతువులు— పేలాదిపేలు— కంగారుగా పరుగులు తీస్తున్నాయి.

''నాకు తెలీకుండా బాసలో ఏటమ్మా అంటున్నారు ? సెప్పండమ్మా !'' అంది పైడమ్మ దీనంగా చూస్తూ బతిమాలుకునే ధోరణిలో.

కళకు పైడమ్మకు అర్థమయ్యేలా చెప్పటానికి భయమేసింది. ఒక వంక నిజంగా పైడమ్మది లవ్ మేరేజి అవునో కాదో తెలుసుకోవాలని కుతూహలంగానూ ఉంది.

అందుకని ''పైడమ్మా ! నేనొక మాట అడుగుతాను. కోప్పడకు. . . నువ్వు నీ మొగుణ్ని ప్రేమించావటే ?'' అనడిగింది కళ.

పైడమ్మ చేతిలోని చీపురుకట్ట పారేసి కింద చతికిల బడిపోయింది పొట్ట చేత్తో పట్టుకుంటూ.

నవ్వి నవ్వి కళ్లవెంట కారిన నీళ్లు తుడుచుకుంటూ ''పెల్లకొండమ్మా మీ సెప్పె మారగాను ! వోరి మొగుడిమీద వోరికి పేముండదు ? సిత్రంగా మాటాడతారేటమ్మా ? మా యుజమాని తాగితంద నాలాడతాడు. పట్టుకు తన్నాడు. అల్లందుకని పేమనేకుండా పోసుందేటమ్మాయిగోరూ ? రేపిద్దన పెళ్లయితే బావగారిమీద మీకుండదేటమ్మా ?'' అంటూ కొంటెగా నవ్వింది పైడమ్మ.

కళ తెల్లబోయి ఏమనలేక తడబడింది. చిత్ర కళనుచూసి నవ్వింది.

''అదికాదు పైడమ్మా ! దీనికి ప్రశ్న అడగటమే తెలీదు. పెళ్లికాకముందు నీకు నీ యుజమాని తెలుసా ?'' అనడిగింది చిత్ర పైడమ్మకు అర్థమయ్యేట్టు మాట్లాడుతూ:

పైడమ్మ మళ్లా పొట్ట చేత్తో పట్టుకుంది. చిత్ర తెల్లబోయింది. మాట్లాడకుండా పైడమ్మను చూస్తూ నిలబడింది.......

పైడమ్మ కాస్సేపటికి నవ్వాపుకుని ''ఈ కాలం పెళ్లిళ్లనాగ అనుకున్నారేటమ్మా ! నా పెళ్లికి

# అయిదు రెళ్ళు

నేను బంగరుతున్నానటమ్మాయిగోరూ !'' అంది చీపురు చేతిలోకి తీసుకుంటూ.

''మా యుజమాని 'ఇంత' పిల్లోడట'' అంటూ నేలమీదికి కాస్త ఎత్తున రెండోచేయి పెట్టి 'ఇంత' అంటే ఎంతో చూపించింది.

చిత్ర దానిమ్మ గింజల్లాంటి పలువరుసను బైటపెడుతూ పకపక నవ్వింది. చెవినున్న జూంకీలు చలాకీగా ఉయ్యాల లూగాయి. కళకు మనస్సు చిన్నబుచ్చుకున్నట్టయింది. చిత్రకేసి చిరాగ్గా చూసి ''ఎందుకా నవ్వు ? నేను కల్పించానా ఏమిటి? సుధాకర్‌గారు అలాగే చెప్పారుగా ?'' అంది మూతి ముడుచుకుంటూ.

చిత్ర మళ్లా నవ్వింది.

''అతనిపేరు సుధాకర్‌కాదు ప్రభాకర్ !''

కళ తత్తరపడింది. సిగ్గుపడింది. బుగ్గలు ఎర్రబారాయి. చిత్ర తన మనస్సును పసికట్టేసిందేమోనని గాభరాపడింది. మనస్సులోని సంభ్రమం కప్పిపుచ్చుకునే ప్రయత్నంలో కళ కంగారుగా మాట్లాడింది.

''ప్రభాకర్ చెప్పింది పొల్లుపోదని నాన్నగారు అన లేదూ ? పైడమ్మ చెయ్యిని ప్రభాకర్ చూసినా ఈ ముక్కే అంటారు..........''

''అవునవును ! ఆయన చెయ్యి చూసి చెప్తే నాన్నగారికి సరిపోయింది.....ఏడాది నిండని పైడమ్మకు, రెండు మూడేళ్ళున్న పైడమ్మ మొగు



డికి ప్రేమేమిటి ?'' అంది చిత్ర నవ్వుతూ.

''ఏమో మరి ! పైడమ్మ చేతిలో మటుకు లవ్ మేరేజి ఉంది. కావాలంటే నీ మట్టుకు నువ్వే చూడొచ్చు—'' అంది కళ సీరియస్‌గా.

పైడమ్మ తుడవటం ఆపి మళ్ళా అడిగింది.

''ఆ మాటంటే మన బాసలో ఏటమ్మా ?''

చిత్ర నవ్వుతూ వెక్కిరిస్తున్నట్టుగా అన్నది

''అంటే పైడమ్మా ఈ రోజుల్లో అందరూ చేసుకోడంలేదూ ? అలాటి పెళ్ళన్న మాట— నీ చేతిలో కనపడుతున్నదట..........''

పైడమ్మ ముఖం మాడ్చుకుని కస్సుమంది.

''అలాంటి మాటలాడకండమ్మా ! ఈడి నొగ్గేసి మారు మనువుకెల్తే ఆడామాత్రం సుకపెడతాడేటమ్మా ? ఒకడినే నమ్ముకోవాలి కాని....ఛీ ! ఛీ ! ఏం పనులమ్మా ?''

కళకు నవ్వువచ్చింది. చిత్రకూ నవ్వొచ్చింది. పైడమ్మ చూస్తే మరీ భగ్గుమంటుందని ఇద్దరూ ఒకళ్ళనుచూసి మరొకళ్ళు సన్నగా నవ్వుకున్నారు. లవ్ మేరేజి అంటే మారు మనువు అనుకుంటున్నది పైడమ్మ—హతోస్మి ! అని ఇద్దరూ కళ్ళతో మాటాడుకున్నారు.

పైడమ్మ నిశ్శబ్దంగా గది తుడవటం పూర్తిచేసింది.

* * *

జయమ్మ పీటేసుకుని స్టౌముందు కూర్చుంది. వంటింటి గుమ్మందగ్గర గోడకానుకుని కూర్చుంది జానకమ్మ. కళ గదిలో కూర్చుని ఏదో సినిమా పత్రిక తిరగేస్తున్నది. చిత్ర స్కెచ్‌లు వేసుకోవటానికి బైటికెళ్ళింది. శారద జయమ్మకు సాయం చెయ్యటానికి వంటింట్లోకి వచ్చింది.

''కళకు ఇంటిపనులు చేతగావా వదినా ?'' అనడిగింది జయమ్మ వదినకేసి తిరిగి.

జానకమ్మ గతుక్కుమన్నది.

''రాకేం వదినా ? అది నేర్చుకున్న చదువే అదట ! ఇంట్లో రోజూ అదే చేస్తుంది......'' అంది కళను సమర్థిస్తూ. పైగా కళను కేకేసింది. కళ పుస్తకం మడిచి పట్టుకుని జానకమ్మ దగ్గరకొచ్చింది.

''ఎందుకే ?'' అంటూ.

''అత్తయ్యకు సాయం చెయ్యకుండా ఆ పుస్తకం ఏమిటే ? నేను పొయ్యి దగ్గరకు వెళ్తే మీ అత్తయ్య ఒప్పుకోదు. మీరుకూడా సాయం చెయ్యకపోతే ఎలా ? వదిన నీకేం పనులు రావను కుంటున్నదిలే—''

కళ మాట్లాడకుండా పుస్తకం అలమరాలో పడేసి జయమ్మ దగ్గరకెళ్ళి నించుంది.

''శారద ఉన్నదిగా అత్తా ? ఏంకావాలి ?'' అంది.

''అది ఉంటే ఉన్నదిలే......ఇలా వచ్చి కూర్చో !'' అంది జయమ్మను కళను ఆప్యాయంగా ఆజ్ఞాపిస్తూ. కళ మనస్సులో విసుక్కుంటూ జయమ్మకు దగ్గరగావచ్చి కూర్చున్నది.

శేఖర్ చదువు పూర్తయింది. కళ చదువుకూడా అయిపోయింది. వాళ్ళిద్దరికీ ఈ ఏడాది పెళ్ళి చేసేస్తే తన బాధ్యత తీరిపోతుంది అనుకుంది జయమ్మ. అప్పటికీ తనకు కోడలు అసరాగా ఉంటుంది. మరో ఏడాదికి తను చక్కగా మనవడిని ఎత్తుకోవచ్చును. పసిపిల్లల్ని ఎత్తుకోవాలంటే తనకెంతో సరదా. శేఖర్ పుట్టిన కొన్నాళ్ళకు వాళ్ళ నాన్న కాస్త పోయాడు. అయితే ఆయన సుఖంగా

# అ య దు రె ళ్ళు

జీవించటానికి చాలినంత ఆస్తి వదిలి వెళ్ళిపోయాడు. కాబట్టి ఒకరి పంచన చేరకుండా తన బ్రతుకు తాను బ్రతకగల్గింది. పిల్లాడిని పెంచి, పెద్దవాడిని చేసి ప్రయోజకుడిని చేయగల్గింది. శేఖర్ ఈ ఏడే బి.ఏ (ఆనర్సు) పరీక్షలు వ్రాసొచ్చాడు.....ఇప్పుడింక వాడికి పెళ్ళికూడా అయిపోతే తనకెలాంటి దిగులూ ఉండదు.

అన్నయ్యకు తనంటే ఎంతో ప్రేమ, అభిమానం. అన్నయ్యను కాదని మరో కోడల్ని తెచ్చుకోవటానికి అన్నయ్య ఏం అపకారం చేశాడు ? పోనీ కళేమైనా అనాకారిదా అంటే అదీకాదు— చిదిపి దీపం పెట్టొచ్చును. పైగా చదువుకున్నది. వాడికి ఈడూ జోడుగా ఉంటుంది. ముచ్చటగా ఇద్దర్నూ తన కళ్ళముందు చిలకా గోరింకల్లా తిరుగుతూ ఉంటే తనకింకేం లోటు ? అయినా జానకమ్మ ఆ మాట కదిపేవరకు తనామాట ఎత్తకూడదనుకుంది జయమ్మ. . .

శారద అగ్గిపెట్టె తెచ్చి స్టౌ వెలిగించబోయింది.

''అత్తకి అక్కసాయం చేస్తుంది లేవే. . నువ్వు కాస్త నాకు నడుం పట్టు—'' అంటూ జానకమ్మ లేచింది మెల్లిగా నడుం పట్టుకుని లేస్తూ.

శారద జానకమ్మ వెనకాతలే వెళ్ళింది. జానకమ్మ గదిలో మంచం మీద పడుకుని పక్కగా ఒత్తిగిల్లింది. శారద యూక్లిప్టస్ ఆయిల్ తెచ్చి మర్దనాచేసింది.

శారదను చూసి 'పిచ్చిపిల్ల ! ఏం తెలీదు ! లోకంలో ఎలా బతుక్కొస్తుందిదో !'' అనుకుంది జానకమ్మ జాలిగా కళ్ళు మూసుకుంటూ. . . .

వంటింట్లో స్టౌ నీలిరంగు మంటలో వెలుగుతున్నది.

''ఏదే కళా ! పెనం ఇలా పడెయ్యి !'' అంది జయమ్మ మంట అనవసరంగా మండుతున్నందుకు కంగారు పడుతూ. కళ పెనం నీళ్ళతో తొలిచి పట్టుకొచ్చింది.

స్టౌ మీద పెనం పెట్టి జయమ్మ ''అట్లు పోసే పిండిలా తీసుకురావే !'' అంది.

పెనం మీది నీళ్ళు జరజరా మధ్యకు జారుతూ, చురచుర లాడుతూ నిమిషంలో ఆవిరై పోయాయి. కళ పిండిపోసి ఉంచిన రాచ్చిప్ప, దానితో పాటు అట్లపుల్ల కూడా తీసుకొచ్చింది.

''నా మతి మండిపోను ! సూసి సంగతి మర్చి పోయాను ! ఆ అలమరాలో ఉంది కాని నూనె సీసా ఇలా అందియ్యవే !. . . .'' అంటూ అలమరాకేసి చెయ్యి చూపించింది జయమ్మ.

నూనెసీసా అందుకున్నాక ఉప్పు సంగతి జ్ఞాపకం వచ్చింది జయమ్మకు.

కళకు పీకదాకా కోపం వచ్చింది. 'అట్లు పోసే అమ్మకు అరవై యారొత్తులు' అని వూరికే అనరు అనుకుంది లోలోన మండి పడుతూ. అయినా పైకి కోపం కనపట్టనివ్వకుండా ఉప్పు, ఉప్పు తర్వాత పిండి కలపటానికి నీళ్ళు, పిండి మరీ గట్టిగా ఉందని మళ్ళా మరో గ్లాసెడు నీళ్ళు— ఇలా వరసగా ఒక్కొక్కటే అందిస్తూ కూర్చున్నది.

అట్లు పోస్తూ జయమ్మ మొదలు పెట్టింది.

''మీ బావకు మినపట్లంటే మహా ఇష్టమే ! శనివారం నాడు రాత్రిపూట వాడు అన్నం తినడు. . . ఈ రోజుల్లో చదువుకున్న వాళ్ళకి దేవుడంటే భయమూ భక్తీ లేవు. కాని మీ బావకి ఎంత భక్తనుకున్నావ్ ?. . .'' అంటూ మధ్యలో ''ఏదీ ! ఒక పళ్ళెం ఇలా పట్టూ !'' అంది అట్ల పుల్లతో అట్టు తిరగేస్తూ.

పళ్ళెం అందుకుని మళ్ళా మొదలు పెట్టింది.

''చదువుకో మీ బావను మించిన వాడు లేడే ! వాడి గదిలో బీరువా చూశావు కదూ ? అందులో వన్నీ వాడికొచ్చిన పుస్తకాలే !. . . .''

''వూ !''

''వంటి పిల్లలంటే వాడికెంత ముద్దనుకున్నావ్ ? పక్కింటి శేషమ్మగారి మనవణ్ణి నిమిషం వేపు పట్టుకుని వదిలేవాడు కాదు. . . ఈ మధ్య ఆవిడ కూతురు అత్తగారింటికి వెళ్ళి పోయిందిలే.

32 వ పేజీ చూడండి





# దొంగ కథలు

రచన: రామలింగం

**రామవర్మ అనే ఒక రాజుగారుండే వారు. ఆయన రాణిగారు చాలా మంచిది. వాళ్లకి ముగ్గురు కొడుకులు పుట్టారు. అందరూ కలిసి చాలా సంతోషంగా ఉండేవాళ్లు. ప్రజలకీ రాజుగారి కుటుంబమంటే చాలా అభిమానం, ఇష్టం.**

ఇలాఉండగా రాణిగారికి హఠాత్తుగా జబ్బుచేసింది. ఎన్నిమందులిచ్చినా తగ్గలేదు. ఇక తను బ్రతకనని గ్రహించిన రాణిగారు రాజుగారిని పిలిచి, "నేను పోయిన తర్వాత మళ్ళీ పెళ్ళిచేసుకునేట్లయితే మన ముగ్గురు కొడుకులనీ దూరంగా ఉంచండి! సవతితల్లి ఎలా చూసుకుంటుందో ఏమిటో," అని చెప్పి, అలాగే చేస్తానని మాట పుచ్చుకుంది.

పాపం, రాణిగారు ప్రాణాలు విడిచింది. మంత్రుల బలవంతంమీద రాజుగారు మళ్ళీ పెళ్ళిచేసికోవలసి వచ్చింది. అయితే, ఆయన తనవాగ్దానం మరచిపోలేదు. ముగ్గురు రాకుమారులను రాజ్యం మారుమూలలో ఉన్న ఒక కోటలోకి మార్చాడు.

రెండవ రాణిగారు వచ్చిన కొంతకాలానికి ఆవిడకు కొడుకు పుట్టాడు. అంతా సంతోషంగానే ఉన్నారు. ఒకనాడు సాయంత్రం రాణిగారు అలా షికారు కెళ్ళారు. రాజభవనం తోటలో ఒక పూరిగుడిసె వుండేది. అందులో ఉంటున్న ఒక ముసలిది రాణిగారిని చూసి, వినపడేట్లుగా, "మొదటి రాణిగారు పోయినతర్వాత మాకు దిక్కులేదు.! ఆవిడ సంగతే వేరు!!"అంది.

ఈ మాటలు విన్న చిన్నరాణిగారు బాధపడింది. ఆముసలిదాని దగ్గరకుపోయి సంగతంతా కనుక్కుంది. తన కొడుక్కి రాజ్యం రాదేమోననే బెంగపెట్టుకుంది. తన సవతి కొడుకులుముగ్గురినీ ఎలా వదిలించుకోవాలని ఆ వృద్ధురాలిని అడిగింది.

"నేను చెప్పినట్లు చెయ్యి! రాజుగారితో, వారి ముగ్గురినీ ఇక్కడికే పిలిపిస్తే సొంతపిల్లల్లాగ చూసుకుంటానని చెప్పు! వాళ్ళు వచ్చింతరువాత ఒకళ్ళ తరువాత ఒకరిని ముగ్గురినీ చదరంగం పోటీకి పిలువు. నేను మాయ చదరంగం బల్లనిస్తాను. దానితో ముగ్గురినీ ఓడగొట్టేశయి. ఓడిపోయినందుకు, వీరవర్మ మహారాజు వద్ద ఉన్న మూడు గుర్రాలని తీసుకు రమ్మని పంపు. ఇక మళ్ళీతిరిగి రారు! ఒక దఫా వీరవర్మవద్దకి గుర్రాలకని వెళ్ళినవారు ఎవరూ తిరిగి ప్రాణాలతో తిరిగి రాలేదు. ఇక నీ కుమారుడికే రాజ్యం!"అని నూరిపోసింది ముసలిది..

కొత్తరాణిగారికీ సలహా నచ్చింది. ఆసాయంత్రమే రాజుగారితో మాట్లాడి సవతి కొడుకుల ముగ్గురినీ రప్పించే ఏర్పాట్లు చేసింది. "వాళ్ళు నా కొడుకుల వంటి వాళ్ళేకదా!" అంది.

తనవాగ్దానం సంగతి మరిచి పోయిన రాజుగారు అలాగేనని తన మొదటి భార్యద్వారా కలిగిన ముగ్గురు రాజకుమారులనూ పిలిపించి, వారికి పెద్ద ఆహ్వానం జరిగే ఏర్పాట్లు చేశాడు. ప్రజలందరూ రాజకుమారులని చూసి ఆనందించారు.

పెద్ద విందొకటి జరిగింది. విందు ముగియగానే రాణిగారు చదరంగం బల్ల పరిపించి సవతి కుమారులని

పోటీకి పిలిపించింది. కాని ముగ్గురితోను గెలువలేదు. ఒక ఆటలో అపజయం కలిగింది.!

రాత్రి నిద్రపోయేముందు, పెద్ద సవతి కొడుకు వచ్చి, "నేను ఓడిపోయినందుకు ఏం శిక్షవేస్తారు ?" అని అడిగాడు.

"శిక్షకాదుగాని, వీరవర్మ దగ్గిర ఉన్న మూడు గుర్రాలను తీసుకువచ్చేదాకా తిన్నచోటే తిననని, నిద్రపోయినచోటే నిద్రపోనని మీరు ముగ్గురూ మాట ఇవ్వండి !" అంది రాణిగారు.

అలాగేనని అంగీకరించాడు రాజకుమారుడు. కాని తాము ఒక ఆట గెలిచారు కాబట్టి ఎదురు శిక్ష వేస్తానన్నాడు; తాముతిరిగి వచ్చేదాకా రాణిగారు కోట మేడ మీదనే ఉండాలన్నాడు. రాణిగారికి ఇది పెద్ద కష్టంగా తోచలేదు. సరేనని, ఒప్పుకుంది. అయినా పయిటికి మాత్రం ఇష్టంలేనట్టుగా, "ఈశిక్ష నుంచి తప్పించు, నిన్ను నేను వేసిన శిక్షనుంచి తప్పిస్తాను," అంది.

దానికి సవతికొడుకులు అంగీకరించలేదు. చెప్పినమాట కాదనమన్నారు. మర్నాడే ముగ్గురు రాకుమారులూ వీరవర్మకోటకి ప్రయాణం కట్టారు. నిజం చెప్పాలంటే అదెక్కడుందో వాళ్ళకి సరిగా తెలియదు. దారిలో కనిపించిన వారందరినీ అడుగుతూ వెళ్ళారు. కొన్ని దినాల తరువాత వారికొక మనిషి కనిపించాడు. నల్లటోపీ పెట్టుకుని ఉన్నాడు. ఒక కాలు కుంటి

"మేము రామవర్మ మహారాజు కుమారులం వీరవర్మ రాజుగారి గుర్రాలు మాకు కావాలి. ఆయన కోటకి దారి యేటు ?" అని అడిగారు.

"ఇప్పుడుకే చీకటిపడుతోంది కదా! ఈ రాత్రికి నా ఇంట్లోనే ఉండిపోయి రేపు బయలుదేరుదాము. నేనూ మీతోనే వస్తా,"నన్నాడు నల్లటోపీ మనిషి.

ఉదయం బయలుదేరేముందు రాకుమారులని పిలిచి, "మీరు తలపెట్టినది మామూలు పని కాదు, ఇలా ఎందరోవచ్చి గుర్రాలు తీసుకుపోబోయి ప్రాణాలు వదులుకున్నారు! అయినా మీరుసాహసం కలవారిలా కనిపిస్తున్నారు ! రండి మన ప్రయత్నం మనంచేద్దాం," అన్నాడు.

నల్లటోపీమనిషికి దారి బాగాతెలుసేమో ! రాత్రికే వీరవర్మ కోటకి చేరుకున్నారు. ఎవరికీ తెలియకుండా, రహస్యంగా గుర్రపు శాలని చేరుకున్నారు. వారికి కావలసిన అశ్వాలని తీసుకుపోబోయారు. ఇంకేముందీ, అవి గట్టిగా సకిలించి రక్షకభటులు మేలుకున్నారు! నలుగురినీ రాజుగారి ముందుకి లాక్కెళ్ళారు.

వీరవర్మ ఒక పెద్ద సభామందిరంలో ఒక గొప్ప బంగారుసింహాసనంమీద కూర్చునిఉన్నాడు. చుట్టూ ఖడ్గధారులైన అంగరక్షకులు ! ప్రక్కనే ఒక కాగు నిండా మరుగుతున్న నూనె !!

"నిన్నుచూస్తే నల్లదొంగ గుర్తుకొస్తున్నాడు!" అన్నాడు రాజుగారు గంభీరంగా, నల్లటోపీ మనిషిని చూసి.

"నేనే నల్లదొంగను కదండీ !"అన్నాడు అతను.

"నిజంగానా ? సరేకాని వీరు ముగ్గురూ ఎవరు?"

"రామవర్మ మహారాజుగారి కుమారులు !"

"అలాగా? అయితే చిన్నవాడితో మొదలు పెడదాం! వీడి ఇలా కాగువైపుకి తీసుకురండి — నూనె బాగామరుగుతోంది..." అన్నాడు వీరవర్మ రాజు తన భటులతో. అని, అంతటితో ఆగక నల్లదొంగవైపు తిరిగి, "చూశావా ఈ అబ్బాయి చావుకి ఎంత దగ్గరగా ఉన్నాడో ?" అని అడిగాడు.

"కాదనను కాని నేనింకా దగ్గరగా ఉండి బతికాను— ఒకసారి,"అని నల్లదొంగ జవాబిచ్చాడు.

"ఏమిటా కథ ? నిజమే అయితే ఈ అబ్బాయిని వదిలేస్తా !" అన్నాడు రాజుగారు.

"అయితే వినండి !"అని నల్లదొంగ తన కథ చెప్పాడు.

* * *

—అవినాచిన్నప్పటి రోజులు. నాకుబాగాఆస్తి ఉండేది. హాయిగా బతుకుతూ ఉండేవాడిని— అంటే, ముగ్గురు మంత్రకత్తెలొచ్చి నన్ను దివాలాతీయించే దాకానన్నమాట ! అప్పట్నుంచే ఈదొంగవృత్తిని స్వీకరించాను. నల్లదొంగగా మంచి కీర్తి సంపాయించాను లెండి....

ఈ ముగ్గురు మంత్రకత్తెలు ఎవరనుకున్నారు ? మారాజ్యంలోనే ఉంటున్న మరొక దేశపు రాజుగారి కుమార్తెలు. పగలంతా చాల అందంగా కనిపించేవాళ్ళు రాత్రి అవగానే వికారంగా దెయ్యాల్లాగ తయారయ్యేవారు.

నా ఆస్తంతా పోయిందన్నాను కదూ ! పోయిన మాట నిజమే కాని, దానికి కొంతకాలంముందే నా యింటి ముందు ఒకపెద్ద గడ్డివాము వేయించుకున్నాను. ఒక రాత్రి, మంచివిందారగించి ఇంటికి తిరిగి వస్తున్నాను. ఏముందీ , ముగ్గురు భూతాల్లాంటి ఆడవాళ్ళు నా గడ్డిని దొంగిలిస్తున్నారు ! మోపులు మోపులుగా తీసుకెళ్ళి పోతున్నారు నా వామునంతా పూర్తిగా దోచేసారు.

ఇలా ఉందా! అనుకుని, మరొక వాము వేయించి మళ్ళీ దొంగిలించటానికి వచ్చిన ఆమంత్రకత్తెల వెనకే వెళ్ళాను. కొండల మీదకి వాళ్ళని వెంటాడాను. భూమికింద, ఇరవయి మనుష్యుల నిలువులోతున్న ఒకగుహలోకి ముగ్గురూ మాయమయ్యారు. నేనూ అందులోకి తొంగి చూచాను. కింద యేదో వండుకొని తింటున్నారు. సరే ననుకుని పక్కనే వున్న ఒక రాతిబండని ఎత్తిగుహలోకి తోసేశాను!

తోసిన వెంటనే పరుగు తీశానుకాని ముగ్గురు మంత్రకత్తెలు నన్ను వెంటాడడం గమనించాను. రాత్రి నెలాగో తప్పించుకొన్నార్నమాట ! లాభంలేదనుకుని ఒకపెద్ద చెట్టునెక్కి దాక్కున్నాను. వాళ్ళుమాత్రం వూరుకున్నారా ? మొదటి ముసలి భూతం గొడ్డలిగా మారిపోయింది. రెండోది వేట కుక్క అయిపోయింది. మూడోది గొడ్డలితో చెట్టు నరకటం మొదలుపెట్టింది !

ఒక్క వేటుతో చెట్టు మొదలు కొంత తెగింది. రెండవ దెబ్బతో సగం పైన తెగింది. ఇక మూడవ వేటుకి గొడ్డలి ఎత్తుతుండగా పొద్దుకోడి కూసింది. గొడ్డలీ, వేటకుక్కా, ముసలి భూతం ముగ్గురు చక్కని చుక్కలుగా మారిపోయారు. తమ ప్రయత్నం మానుకుని వెళ్ళిపోయారు.

వీరవర్మ మహారాజా ఇదీ నా కథ ! ఎంత దగ్గిరగా ఉన్నా మృత్యువుని తప్పించుకున్నానా లేదా ?—

అని అడిగాడు నల్ల దొంగ.

"నిజమే ! అయితేనేం, అతను కాకపోతే అతని అన్న. తీసుకురండి కాగు దగ్గరికి !" అనిఅరిచాడు వీరవర్మ.

"పాపం చావు సమీపంలో ఉన్నాడు కాని నా కంటేనా ?" అన్నాడు నల్లదొంగ.

"ఇంకో కథేమిటి ?" వీరవర్మ కుతూహలంగా అడిగాడు.

"ఆహా ! చెప్తాను వినండి. షరా మామూలే కదా ! నచ్చితే మరణశిక్ష విధించకండి !"

* * *

—మంత్రకత్తెల కథ జరిగిన తర్వాత ! వాళ్ళు రాత్రికివచ్చి నా ఆస్తినంతా నాశనంచేసి వదిలారు. దాని తర్వాతనే నాకీ వృత్తి......

ఒక రాత్రి : నా ఆవునీ, గుర్రాన్ని ఇంటికి తోలుకు పోతున్నాను. చిట్టడవి మధ్య ఒకచెట్టు కింద, విశ్రాంతికని దిగాను. బాగా చలిగా ఉంది. చిన్న నిప్పు రాజేశాను. చలి కాచుకుంటూనే ఉన్నాను, ఎప్పుడొచ్చాయో కాని పదమూడు పెద్దపిల్లులు నా చుట్టూ మూగాయి. వాటిలో పన్నెండు ఒక్కొక్కటి మనిషంత ఉన్నాయి. ఇక పదమూడవది ఇద్దరు మనుష్యులంత ఉంది ! మంటల కాంతికి దాని కళ్ళు పచ్చగా మెరుస్తూ ఉంటే చూసి హడలిపోయాను. దాని కిరువైపులా చెరొక ఆరుపిల్లులూ కూర్చున్నాయి. వాటి గురకలు విని 'ఉరుముతోంది' అనుకున్నాను.

కొంతసేపు ఏమీ అనలేదు. చివరికి పెద్ద పిల్లి, "ఏదయినా ఇవ్వు, తింటాను !" అంది.

"నా దగ్గరేముంది గనక ఆ ముసలి గుర్రం తప్ప ?" అన్నాను నేను.

పిల్లి ఒక్క గంతువేసి గుర్రం మీద పడింది. సగం తను తిని, మిగతా సగం తక్కిన పిల్లులకి ఇచ్చింది. విందారగించిన తర్వాత అన్నీ మంట చుట్టూ చేరాయి. మళ్ళా పెద్ద పిల్లి, "ఆకలిగా ఉంది! ఏం పెడతావు ?" అని అడిగింది.

"ఇక మిగిలింది ఆ ఆవు ఒకటే !" అన్నాను.

పిల్లులు దానిని మింగాయి. ఇక నా వంతు రాబోతున్నదని గ్రహించిన నేను ఒక విరిగిన చెట్టు బోదెకి నా కోటు తగిలించి, దానిమీద టోపీ ఉంచి నిశ్శబ్దంగా చెట్టెక్కి కూర్చున్నాను.

కొంతసేపు గడిచింది. నా కోటునిచూసి చీకట్లో నేనే అనుకుని పెద్దపిల్లి, "ఇంకా ఆకలిగా ఉంది !" అంది.

సమాధానం రాకపోయేసరికి పిల్లి కోటుమీదకి ఉరికింది.

"తప్పించుకున్నాననుకుంటున్నావా ? ఇదిగో పట్టేస్తాను చూడు !" అని గర్జించింది.

పన్నెండు పిల్లులు నాలుగు దిక్కులకి వెళ్ళాయి వేటమీద. పెద్ద పిల్లి చెట్టుకింద నడుం వాల్చింది. త్వరలోనే తక్కినవి తిరిగి వచ్చేసి నా జాడ లేదని చెప్పాయి. పెద్ద పిల్లి పైకి చూసింది. నేను చెట్టు మీదనే ఉన్నానని పసికట్టింది.

"ఈ చెట్టు మొదలు తెగకొడదాం !" అని తన తోటి పిల్లులని ఆ పనికి ఉసికొలిపింది. చెట్టుపడిపోతూ ఉందనగా నేను పక్క చెట్టుమీదకి ఉరికాను! పిల్లులుమాత్రం తక్కువ తిన్నవా ? ఆ చెట్టుమీద పడ్డాయి. మళ్ళీ ఇంకో చెట్టుమీదకి ఉరికాను. ఇలా చెట్టుమీదనుంచి చెట్టుకి ఎగురుతూ అడవి చివరికి వచ్చాము. ఇక నా గతి ఏమిటి ? ఆఖరు చెట్టు తర్వాత పిల్లి నోట్లోకే దూకాలి..... ఆ చెట్టూ వచ్చింది. అది కూలిపోతూ ఉందనగా అటు వైపు పదమూడు పెద్ద తోడేళ్ళు వచ్చాయి !

తర్వాత ఏమౌతుందో వేరే చెప్పాలా ? పిల్లల్ని తోడేళ్ళు, తోడేళ్ళని పిల్లలూ పంపుకున్నాయి. నేను తప్పించుకున్నాను—

"వీరవర్మరాజా, నేను ఈ రాజకుమారుడికన్నా మృత్యువుకి దగ్గరగా ఉండినప్పటికీ తప్పించుకున్నానా లేదా ?" అని నల్లదొంగ ప్రశ్నించాడు.

"కాదననులే ! అయితే మూడవ వాడిని వెయ్యించటానికి తయారుచేద్దాం !" అన్నాడు వీరవర్మ.

"పోనీ ఇంకో కథ చెప్పగలవా ? ఈ మారు ఇతన్ని తప్పించగలవా ?"

"వినండి !" అన్నాడు నల్లదొంగ.

* * *

—నేను దొంగతనంలో మంచిపేరు సంపాదించుకున్న తర్వాత కొందరు శిష్యులని తయారుచేస్తే మంచిదనుకుని ఒక చురుకైన కుర్రవాడిని చేరదీశాను.

మా దేశం పొలిమేరల్లో రాళ్ళ గుట్టల మధ్య ఒకపెద్ద రాక్షసుడు ఉండేవాడు. చుట్టుపక్క ప్రాంతాలలో అతను చెయ్యని దోపిడీ, దొంగతనం, ధ్వంసం లేదనుకోండి ! ఈ రాక్షసుడి గుహల్లో ఎంత ధనం ఉందో ? తలుచుకుంటేనే ఆశపుట్టింది. ఎత్తులు వెయ్యటం మొదలుపెట్టాము....

రాక్షసుడి నివాసం చేరుకున్నాము. అతను ఒక పెద్ద గుహలో ఉండేవాడు. లోపలికి వెళ్ళాలంటే సామాన్యంకాదు. దిగి వెళ్ళటం చాలా కష్టమైన పని; ఎంతో సేపు పడుతుంది. ఆలోచించి, చివరకొక నిర్ణయానికి వచ్చాము. రాక్షసుడు లేనప్పుడు తాడు వేసి దిగి వీలయినంత సొమ్ము దోచుకురావాలనుకున్నాము. నా శిష్యుడినిదిగమన్నాను. సగందిగి ఒకటే బొబ్బలు పెట్టటం మొదలుపెట్టాడు. పైకి లాగాను.

"నువ్వే వెళ్ళు! భయంగా ఉంది !" అన్నాడు.

నేనే కిందికి దిగి వెళ్ళి కొన్ని పంచుల బంగారాన్ని, నగలనీ పైకి పంపించాను. "ఇక నన్ను పైకి లాగు !" అని కేక వేశాను.

"గురువుగారూ ! నా శిష్యరికం తీరింది, సెలవు!"

# దొంగ కథలు

అని నా శిష్యుడు నిర్దాక్షిణ్యంగా నన్నక్కడే వదిలి వెళ్ళి పోయాడు.

పైకి ఎక్కి వెడదామని చూశాను. ఎలా ? దారి కనిపించలేదు. ఇంతలో రాక్షసుడు తిరిగి వస్తున్న శబ్దాలు వినిపించాయి. చుట్టూ కలయ చూశాను. ఒక మూల కొన్ని శవాలు కనిపించాయి. నేనూ మరొక శవంలాగా వాటితో బాటు పడి కదలకుండా ఉండిపోయాను.

రాక్షసుడు ఒక నిచ్చెన మీదుగా కిందదిగి శవాలన్నిటినీ ఒక బుట్టలో పడేశాడు. నేను కూడా బుట్టలో పడ్డాను ! ఇంతలో అతను నిప్పురాజేసి వేడినీళ్ళు పెట్టటంలో నిమగ్నుడయ్యాడు.

ఇదే అదను అనుకుని నేను బుట్టలో నుంచి బయటికి దూకి ఒక మూల దాక్కున్నాను. రాక్షసుడు భోజనం ముగించి నిద్ర పోయాడు. నేను చల్లగా నిచ్చెన ఎక్కి బయటికి జారుకున్నాను—

"ఏమంటారు ?" అని అడిగాడు నల్లదొంగ కథ ముగించి.

"బాగానే ఉంది కాని ఇప్పుడు నీవంతు ! అదీ కాక ఇది నీ ఆఖరి కథ అవుతుంది, రా !" అన్నాడు వీరవర్మ క్రూరంగా నవ్వుకుంటూ.

"చావుకి అతి సమీపంలో ఉన్నాను, నిజమే కాని ఇంతకు మించిన ప్రమాద పరిస్థితిని గురించి చెప్తాను వింటారా ?" నల్లదొంగ స్థిమితంగానే అడిగాడు.

"పోనీ చెప్పు !" అని వీరవర్మ తన భటుల్ని ఆపాడు.

* * *

—ఒకరోజు నేను బాగా అలిసిపోయి ఉన్నాను. అలా నడిచి వెడుతూ ఉండగా నాకు కనిపించిన మొదటి ఇంట్లోకి వెళ్ళి భోజనం పెట్టమని కోరుదామనుకున్నాను. లోపల ఒక అమ్మాయి కనిపించింది. అమ్మాయి ఒళ్ళో ఒక చిన్న పాపాయి కనిపించాడు. ఆమె చేతిలో కత్తి పెట్టుకుని దిగులుగా పిల్లవాడి




అంక చూస్తోంది. వాడేమో ఒకటే కేరింతలు కొడుతున్నాడు. నాకు ఇదంతా అర్థం కాలేదు.

"ఆ కత్తెందుకూ ?" అని అడిగాను. "ఎందుకంత విచారంగా ఉన్నావు ?"

ఆ అమ్మాయి తన కథ చెప్పింది. అది రాక్షసుల ఇల్లట. కొంత కాలం క్రితం ఆమెని ఎత్తుకు వచ్చేసి తమ ఇంట్లో వంట మనిషిగా ఉంచుకున్నారుట. ఈ రోజు ఈ చిన్న పాపాయిని తీసుకు వచ్చి, వండి పెట్టమని చెప్పి బయటికి వెళ్ళారుట. వాడు ఒక రాజుగారి కొడుకుట. ఏం చెయ్యాలో తెలియక దిగులుగా ఉందిట. . .

"భయపడక, నేను చెప్పినట్లు విను !" అన్నాను. "ఒక పంది పిల్లని వండి రాజకొడుకునే వండినట్లు చెప్పు. ఈ పిల్లాడి చిటికెన వేలుకోసి చూపిస్తే చాలు, అంతా నమ్ముతారు !"

అంత పనీ చేయించి, పిల్లవాడితో బాటు వంట గదిలో దాక్కున్నాను. రాక్షసులు పంది మాంసాన్ని తిని చాలా బావుందనుకున్నారు. కాని అంతటితో ఊరుకోక, వంటగదిలో ఇంకా ఏమయినా ఉంటే చూడాలనుకున్నారు. ముందు ఒకడు వచ్చాడు. పొంచి ఉన్న నేను వాడిని పొడిచి చంపేశాను. పెనుగులాటలో నా కాలు తెగింది కాని ప్రాణం పోలేదు.

తర్వాత రెండవ వాడు వచ్చాడు. వాడినీ చంపాను కాని నాకు బాగా గాయం తగిలింది.

ఇంకొక రాక్షసుడు మిగిలాడు. తక్కిన వాళ్ళు రాలేదని తనూ వచ్చాడు. తనతోటి వారి శవాలు చూసి, ముందే జాగ్రత్తపడి నా మీదికి ఉరికాడు. పెద్ద పోరాటం జరిగింది. ఎలాగయితేనేమి వాడిని హతమార్చాను. కాని నాకూ బాగా దెబ్బలు తగిలాయి. సోలవచ్చి కింద పడిపోయాను.

పాపం, ఆ అమ్మాయి పరిగెత్తుకుని వచ్చింది. "ఇక బతకను పిల్లవాడిని జాగ్రత్తగా చూడు !" అన్నాను నీరసంగా.

"ఏం పరవాలేదు, ఉండు !" అని అమ్మాయి నన్ను నీటికాగు దగ్గిరికి లాక్కుని వెళ్ళి అతి ప్రయాసతో నన్ను దానిలోకి తోసింది. అప్పుడు నాకు స్పృహ తప్పింది. మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఆశ్చర్యం వేసింది ! నా గాయాలన్నీ నయమయిపోయి ఉన్నాయి ! !—

"వీరవర్మరాజుగారూ ! ఇప్పుడు చెప్పండి, మృత్యువుకి వీలయినంత దగ్గిరగా వెళ్ళానా లేదా ?" నల్లదొంగ అడిగాడు.

"నల్లదొంగా నువ్వు చెప్పింది నిజం ! ఒకవేళ నిజం కాకపోయినా నిన్నేమీ చెయ్యను ! ! ఎందుకంటావా, ఆ వేలు తెగ్గొట్టిన పిల్లవాడిని నేనే ! నీ మూలంగానే నేనీ రోజు ప్రాణంతో ఉన్నాను. చూడు !" అంటూ వీరవర్మ తన చెయ్యి ఎత్తి చూపించాడు. "నల్లదొంగ రక్షించాడని మా తండ్రిగారు చెపుతూనే ఉండేవాడు ! నువ్వో కాదోనని పరీక్ష పెట్టాను. నల్లదొంగా నీకు సుస్వాగతం !"

* * *

అందరికీ పెద్ద విందు జరిగింది. ఎన్నో కానుకలూ, నగలూ ఇచ్చి ఇంటికి సాగనంపాడు వీరవర్మ నల్లదొంగనీ, రాకుమారులనీ.

"నా గుర్రాలు కూడా తీసుకు పొండి ! కాని మీ పని ముగిసిన తర్వాత వాటిని వదిలెయ్యండి !

అని తిరిగి వచ్చేస్తాయి," అని చెప్పేడు వాళ్లతో పంపించే ముందు.

"అలాగే," నన్నారు వాళ్లు. నల్లదొంగతో బాటు తమదేశం చేరుకున్నారు.

* * *

గుఱ్ఱాలతో వచ్చిన సవతి కొడుకులని చూసి రాణిగారు నిరాశచెందింది.

"గుఱ్ఱాలు తీసుకు రమ్మన్నారు, తీసుకు వచ్చాము ! ఇక వదిలి పెట్టేస్తున్నాము," అని రాజకుమారులు గుఱ్ఱాలని వదిలివేశారు. అవి వెంటనే వీరవర్మ వద్దకి వేగంగా పరిగెత్తుకుని వెళ్లి పోయాయి.

"అబ్బాయిలూ, ఇక కోట దిగి రావచ్చునా ?" అని అడిగింది రాణిగారు.

"ఉండండమ్మా ! పైన ఉండమన్నాము కాని దిగి రావచ్చు ననలేదే ?" అన్నారు ఆవిడ సవతి కొడుకులు హేళనగా.

పాపం, రాణిగారికి ఏమి జవాబు చెప్పాలో తెలీలేదు.






డాక్టర్ జ్ఞానేశ్వరరావుగారు పేరుమోసిన సర్జన్. మాజిల్లా అంతటా మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించారు. ఆయనకు తీరిక అయినప్పుడు మాక్లబ్బుకి వచ్చి మాకు తనఅనుభవాలు చెప్తూ వుంటాడు. ఆరోజు వర్షం పడుతూంది. అందరం డాక్టరుగారి చుట్టూ చేరాము. కబుర్లు రకరకాలుగా సాగి చివరకు హత్యల మీదికి మళ్ళాయి. మొన్న మానేపల్లిలో భార్యని చంపి పోలీసులకు స్వయంగా లొంగిపోయాడట ఒకడు—అని మాతో ఒకరన్నారు. డాక్టరుగారు ''అవును నేనూ విన్నాను. మనిషి ఇంకా లాజికల్‌గా ప్రవర్తించడం నేర్చుకోలేదు. తీరిగ్గా ఆలోచించినప్పుడు సబబుగా ఉండే మనిషికూడా ఆవేశంలో అమానుషంగా ప్రవర్తిస్తాడు. ఇక ఆవేశపరుల లెక్కేమిటి ? అందుకే విజ్ఞానంతోబాటు కల్లోలం కూడా ప్రపంచంలో ఎక్కువ అవుతున్నది. మనిషి సాధించిన విజయాలు తన వినాశానికే మళ్ళీ దారి తీస్తాయి. అలాగని ఏమీ అభివృద్ధిచేసుకోకుండా ముక్కుమూసుకుని కూర్చోగలరా ? నా అనుభవంలో ఒక సంఘటన చెప్తాను, వినండి'' అని ప్రారంభించారు.

''అప్పుడే క్లబ్బునుంచి తిరిగి వచ్చి జోళ్ళు విప్పుతున్నాను ఇంతలో నా శ్రీమతి వచ్చి హాస్పిటల్ నుండి మీకు ఫోను వచ్చింది ఇప్పుడప్పుడే మూడో సారి. అర్జెంటుగా మాట్లాడాలంటున్నారు

అనిచెప్పింది. ఫోన్‌లో నా అసిస్టెంట్ ఆనందరావు గొంతు వినిపిస్తున్నది. "సార్ అరగంట క్రితం లారీ ప్రమాదం కేసొకటి చేర్చుకున్నాము. తలమీద గట్టి దెబ్బలు తగిలాయి" అని ఇంకా వివరాలు చెప్పాడు. సరే వస్తున్నానని రిసీవరు పెట్టేసరికి

"ఐతే సవతి పోరు తప్పదన్నమాట. మళ్ళీ ఎప్పుడు దయచేస్తారో" అని మా శ్రీమతి హేళన. ఆవిడకు క్లబ్బూ, హాస్పిటలూ ఇద్దరు సవతులకింద లెక్క. "మరి నీ సవతి ఇప్పుడే రానిస్తుందా! ఏలాగైనా ఆలస్యమౌతుంది. వెళ్ళక తప్పదు" అని బయటకు నడిచాను.

కారులో హాస్పిటలుకి వెళ్ళుతున్నంతసేపూ నేను ఆలోచించింది కేసు గురించికాదు మా శ్రీమతి గురించి. అసలు మా వైద్య వృత్తే అటువంటిది. ఆ మాటకొస్తే ఏ వృత్తైనా అంతేనేమో! ఒక వృత్తిని అవలంబిస్తున్న వ్యక్తికి ఆ వృత్తిమీద, తనమీద ఉన్న అభిప్రాయాలకి, పై వాళ్ళకి ఉన్న అభిప్రాయాలకీ చాలా తేడా ఉంటుంది. ఒక డాక్టరే ఉన్నాడనుకోండి. అతను చేస్తున్న పనిని ఒక వృత్తి ధర్మంగా, విధిగా భావిస్తాడు. ఇంకా ఎక్కువ భావనాబలము, ఆసక్తి ఉన్నవాడైతే తన మేధాశక్తికి పరిశ్రమగా, సాధనగా భావిస్తాడు. కాని అతని హృదయంలో సంచలనంగాని, స్పందనం గాని ఉండదు సాధారణంగా. కాని ప్రతి డాక్టరు జీవితంలోనూ ఎక్కడో మూలదాక్కొని ఉన్న హృదయాన్ని పైకిలాగి కదిలించే సంఘటన ఎప్పుడో ఒకసారి ఎదురౌతూ ఉంటుంది. అటువంటి మరువలేని ఘటనే నాకారోజు ఎదురౌతుందని నేను వూహించలేదు. తొందరగా తిరిగివచ్చి శలవు రోజుని బద్ధకానికి అంకితం చెయ్యాలని అనుకొంటూ హాస్పిటలు ఆవరణలోకి కరుని పోనిచ్చాను.

మెట్లెక్కుతూ ఉంటే నైట్‌క్వీన్ వాసన గుప్పుమంది. అక్కడా మొక్కని ఎవరు వేశారో! ఫలానా గులాబి మొక్కలు ఆ అమ్మగారు నాటేరని, ఫలానా క్రోటన్సు ఆ బాబుగారి ఇంటినుంచి తెచ్చివేశానని మాలి చెప్తూ ఉంటాడుకాని ఆ నైట్‌క్వీన్ గురించి వాడికి తెలీదు. ఆ సువాసన తగలగానే ఎందుకో నాకు వ్యర్థ ప్రణయాలూ, అభిసారికలూ జ్ఞాపకం వస్తాయి. ఏదో తెలియని బాధ రేకెత్తుతుంది.

ఎదురుగా అసిస్టెంటు ఆనందరావు వచ్చి థియేటరు 'సిద్ధంగా ఉంది. రక్తం కూడా ఎక్కించడం మొదలు పెట్టాం.' అనిచెప్పాడు. వెళ్ళి గ్లవ్స్ వేసుకునేసరికి సిస్టర్‌వచ్చి 'గుడీవినింగ్' చెప్పింది. ముఖమంతా కప్పివున్నా ఆ కళ్ళల్లోంచే నవ్వులు చిందించే సిస్టరంటే నాకు చాలా ఇష్టం. కాని పైకిమాత్రం ఆమెతో గంభీరంగా ఉంటాను".

డాక్టరుగారిలా అంటుంటే నా పక్కనున్న కొంటె కోణంగి ఒకడు మోచేత్తో నన్ను పొడిచి నవ్వుతూ ఏదో అనబోయాడు. హుష్ నోరు మూసుకుని వినమని, ఉండబారిన సర్జన్‌గారినే ఆకర్షించే ఆ సిస్టర్ ఎలా ఉంటుందో అని వూహించసాగాను. ఇంతలో డాక్టరుగారు పైపు ముట్టించి మళ్ళీ మొదలుపెట్టారు.

"టేబిల్‌మీద రోగిని పడుకోబెట్టారు. స్పృహ లేదు. వాణ్ణి చూడగానే పోల్చాను. వాడు నాకు కొత్తకాదు. వూళ్ళో పేరుమోసిన రౌడీ. పాపారావని లారీ డ్రైవరు, మనిషి అజానుబాహువు. పట్టి తాగుబోతు. వాడిమీద పోలీసులు కొన్ని కేసులు కూడా పెట్టారు. కాని సాక్ష్యంలేక కొట్టేయవలసి వచ్చింది. గాయాల్ని పరీక్షించాను. పుర్రె ఎముకలు పగిలాయి. మెదడుకూడా రక్తస్రావంచేత దెబ్బతిన్నది. వీణ్ణి బతికించాలంటే ఒకటే పద్ధతి. అమెరికాలో ఇప్పుడనుసరిస్తున్న కొత్త పద్ధతిని అవలంభించాలి. ఐనా విజయవంతమౌతుందని చెప్పలేం. సరే ఏమవుతే అవుతుందని ప్రారంభించాను. మూడు గంటలు పట్టింది. ఇంటికి వచ్చేసరికి మెదడు శూన్యంగా ఉంది. అంతవరకూ తెలియని నిద్ర ముంచుకొచ్చింది. కారాగిన చప్పుడుకాగానే ముంగిట్లో లైట్ వెలిగింది.

మర్నాడు ఆదివారమని బద్ధకాన్ని తీరిగ్గా అనుభవిస్తూ ఇంట్లోనే ఉండిపోయాను. అసిస్టెంటుని చూసుకోమని చెప్పాను. మధ్యాన్నం పిక్నిక్‌కి వెళ్లాలని నా మిత్రుడు రాజా అతని భార్యతోనూ ప్రోగ్రాం వేశాం. రాజా కుటుంబం వచ్చేశారు. మా ఆవిడ హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నది. ఇంతట్లో వచ్చింది ఫోన్‌కాల్. తొమ్మిదో నంబరుకి సీరియస్‌గా ఉందని, ఉన్నట్టుండి రక్తపుపోటు తగ్గిపోయిందని. మాట్లాడకుండా లోపలికివెళ్ళి డ్రస్సు వేసుకుంటున్నాను. మా శ్రీమతికి అర్థమైనట్లు ఉంది. ఉండండి ఒక నిముషమని వెళ్ళి కాఫీ కప్పు పట్టుకొచ్చింది. ఆవిడ ముఖంలో నిరుత్సాహం స్పష్టంగా కనిపిస్తోంది. రాజాకి క్షమాపణ చెప్పుకొని తొందరగా బయటపడ్డాను. కాని ఈ తొమ్మిదో నంబరుమీద చాలా కోపమొచ్చింది. వెధవ ఆగకూడదూ రేపటిదాకా, అనుకొన్నాను. మళ్ళీ నా ఆలోచనకి నాకే నవ్వు వచ్చింది. అది అసంబద్ధమైనది. తెలిసికూడా అలా అనుకోడం సహజమేమో! మానవుడు తెలిసి తెలిసి ఎన్నో అసంబద్ధమైన పనులు చేస్తుంటాడు.

పాపారావుని చూడగానే తెలిసింది. మృత్యువుతో పోరాడి అలసిపోయినట్లు. మహా అయితే ఇంకో గంట బదకవచ్చు. ఉదాసీనంగా వెనక్కి తిరిగిపోబోయాను. ఎదురుగా పరిధీన వదనంతో మబ్బు పట్టిన చంద్రుడిలాగ ఆమె నిలబడివున్నది—పాపారావు భార్యని గురించి విన్నాను కానీ అదే మొదటిసారి చూడ్డం. చాలా అందమైనది, చాలామంచిదని, ఆ రాక్షసుడికి దేవతలాంటి భార్య ఉండడం సృష్టి వైచిత్రం అని. కాని ఇంత అతిలోక సౌందర్యవతి అని చూసేదాకా అనుకోలేదు.

కాని ఆమె గురించి ఇంకో వ్యాఖ్యానంకూడా విన్నాను. పైకి బహుమంచిగా కనిపించినా చమత్కారి అనీ, విలాసవతి అనీ; నలుగురి దృష్టిలో ఉండే వ్యక్తిని గురించి— ఒక అందమైన అమ్మాయి కానీండి, ఒక ప్రముఖ నాయకుడు కానీండి— ఒక గొప్ప కవో, డాక్టరో గానీండి— వాళ్ళ శక్తిసామర్థ్యాలు గురించి, నిజాయితీ గురించి, శీలాన్ని గురించి ఎప్పుడూ విరుద్ధ వ్యాఖ్యానాలు ఉంటుంటాయి. అందులో ఎంతవరకు ఏది నిజమో తెలుసుకోడం చాలా కష్టం.

కాని ఆమెను చూడగానే నాకామెమీద సదభిప్రాయమే తప్ప వేరే విధంగా ఏ భావమూ రాలేదు. నిజంగా ఆమెలో ఉన్నదో నా మనసులో ఉన్నదో పవిత్ర భావమే కలిగింది.

ఆమె కళ్ళదించి "డాక్టరుగారూ, తమరే నాకు దిక్కు. ఈ ఆపదనుండి రక్షించి పుణ్యం కట్టుకోండి. మీమేలు జన్మజన్మలా మరువలేను. మా ఆయన్నెలాగైనా కాపాడండి బాబూ" అని కళ్ళొత్తుకుంటూ అంది. ఆమె వాడిన కలువలాంటి ముఖం చూస్తుంటే నా ఉద్దేశం మారింది. ఆమె కోసం ఏమైనా చెయ్యాలనిపించింది. ఇంతలో ఆనందరావు 'అంతా సిద్ధంగా ఉంది సార్ మీరు చెప్తామంటే వెంటనే రోగిని థియేటరుకి పంపించేస్తాను' అన్నాడు. సరే ఆఖరు ప్రయత్నం చేద్దామన్నాను, మొదటిసారిగా నా ప్రయత్నం సఫలం కావాలని దేవుణ్ణి ప్రార్థించాను. అట్టడుగికి కుంగిపోతున్న మనిషిని మెల్లిగా ఒడ్డుకి తీసుకొచ్చాను. ఆనందరావుని హెచ్చరించి ఇంటికి బయలుదేరాను. రెండు వారాల్లో పాపారావు బాగా కోలుకున్నాడు. వీడు శారీరకంగా పునర్జన్మ ఎత్తాడు. మానసికంగాకూడా పునర్జన్మ ఎత్తితే ఎంత బాగుంటుంది అనుకొన్నాను. కొంతమంది పెద్దగండం గడచి బయటపడ్డాక మారిపోతారు. కాని అదే కొంతమందిలో ఏ మార్పూ తీసుకురాదు. తనకేమీ జరగనట్టే యథాప్రకారంగా సంచరిస్తూ ఉంటారు. పైగా తీవ్రమైన వ్యాధిని అనుభవించిన వాళ్ళు కొంతమంది ఇంకా బండబారిపోయి, లోకంమీద దగ్గరివాళ్ళమీదా అసూయా ద్వేషాలు పెంచుకొంటారు.

ఆ రోజు ఉదయం హాస్పటల్ ఆవరణలో నడుస్తున్నాను, తెల్లవారు ఝామున వర్షం పడి వెలిసింది. నీరెండలో కొబ్బరిచెట్లు జుట్టు విరగబోసుకుని ఆరబెట్టుకొంటున్న అమ్మాయిల్లాగా వూగుతున్నాయి. ఆకాశంలో తెల్లని మబ్బులు విరిసి, చెదరి, కమ్మి, ఆడుతూ ఉన్నాయి. తెల్లటి దుస్తులతో మబ్బులతో పోటీగా నర్సులు అటూ ఇటూ తిరుగుతూ ఉన్నారు. ఆ క్షణంలో లోకమంతా ఆనంద సౌందర్య నిలయమనిపించింది. కాని ఇందులోనే ఎంత దుఃఖమూ బాధా నిస్పృహా మిళితమై ఉన్నాయో ఎలా తెలుస్తుంది ? మెట్లమీద పాపారావు భర్య సుందరమ్మా, ఆనందరావు నిలబడి ఉన్నారు. ఆనందరావు నవ్వుతూ ఏదో హడావిడిగా మాట్లాడుతున్నాడు. ఆనందరావు నిజంగా చిదానంద పురుషుడే. నన్ను చూడగానే తమాయించుకుని గ్రీట్ చేశాడు. 'ఈ రోజు చాలా అందంగా ఉంది కదూ' అని వెళ్ళిపోయాను. రెండు రోజుల తర్వాత వార్డు రౌండ్సు చేస్తుంటే పాపారావు కోపంగా సుందరమ్మను ఏదో అంటున్నట్లు సుందరమ్మ ఏడుస్తున్నట్లు అనిపించింది. నేను దగ్గరికి వెళ్ళేసరికి ఇద్దరూ ఏమీ ఎరగనట్లు ముఖం పెట్టారు.

"నేనింక ఇక్కడ ఉండలేను సార్. బాగయిపోయిందికదా సెలవిప్పించండి" అన్నాడు పాపారావు సరే రేపు వెళ్ళవచ్చునులే అన్నాను.

పాపారావు వెళ్ళిపోయాక కొన్నాళ్ళకుగాని అసలు విషయం తెలియలేదు. పెద్ద పదవుల్లో ఉన్నవాళ్ళకిదే కష్టం. కింద ఏం జరుగుతున్నదో వాళ్ళకు తెలుసుకొందామన్నా కూడా తెలియదు. నన్ను చూడగానే అందరూ ఏమీ ఎరగనట్టే ప్రవ

## ఫలితం

రిస్తారు. కాని మా శ్రీమతికి ఏ రేడియో ద్వారా వర్తమానం అందిందోగాని ఒకరోజు విషయమంతా చెప్పింది. ఆనందరావు సుందరమ్మతో చలాకీగా మాట్లాడ్డం చూసి పాపారావు మండి పోయేవాడట. అంతకుముందు కూడాను భార్య ఎక్కువగా అనుమానించేవాడట. ఎవరితోనైనా పరాయి మగవాడితో మాట్లాడితే చాలు హింసించే వాడట. కాని ఆనందరావు విషయం వేరు. అతను స్త్రీలను ఇట్టే ఆకర్షించగలడు. పెద్ద ఉద్యోగి. కనీసం తను హాస్పిటల్‌లో ఉన్నంతవరకూ ఏమీ చెయ్యలేడు. తన బాగుకోసం అహర్నిశలూ కష్టపెట్టుకుని సేవచేస్తున్న అర్ధాంగిని దుర్భాషలాడే వాడట. అతని నైజం తెలుసు కాబట్టి ఎంత తప్పించుకోడానికి ప్రయత్నించినా ఇవేవీ పట్టని ఆనందరావు కలుగజేసుకుని సుందరమ్మతో మాట్లాడుతూ ఉండేవాడట. ఇరుకు వాతావరణంలో అసూయా క్రౌర్యపూరిత మనస్తత్వాల మధ్య చీకటి బతుకు బతుకుతున్న సుందరమ్మ ఒకవేళ నిజంగానే ఆనందరావుచేత ఆకర్షింపబడ్డా ఆశ్చర్యంలేదనుకున్నాను. బాగా ఉక్కబోస్తున్న రోజు హఠాత్తుగా మబ్బు కమ్మి, చల్లని జల్లుపడితే ఎలా హాయిగా ఉంటుందో అలాగే ఆనందరావు పరిచయం ఆమెకొక వింత అనుభవాన్నిచ్చిందేమో! ఐనా పువ్వు లాటి ఆ అమ్మాయి శీలాన్ని మాత్రం ఇప్పటికీ నేను శంకించడంలేదు.

ఇవన్నీ గడచి ఆరునెలలు కావస్తోంది. పాపారావు గురించి, సుందరమ్మ గురించి కార్యభారంలో మరిచిపోయాను. ఉన్నట్టుండి పిడుగులాటి వార్త తెలియకపోతే, నా విజ్ఞానానికి, సామర్థ్యానికీ గీటురాయైన ఒక 'కేస్'గా మాత్రమే పాపారావు నా స్మృతిపథంలో ఉండేవాడు. కాని ఆ రోజు రాత్రి నిద్రబోతూ ఉండగా టెలిఫోన్ మోగింది. వెంటనే బయలుదేరి వెళ్లాను. ఉధృతంగా వర్షం పడుతోంది. ఎమర్జెన్సీ గది దగ్గరికి వెళ్లేసరికి ఆనందరావు దిగాలుపడి నిలబడి ఉన్నాడు. సుందరమ్మ గుండెమీద కత్తిపోట్లతో నెత్తురోడుతూ కొనవూపిరితో ఉంది. ఆమె మృత్యు గహ్వరంలోకి పోతున్నదని నేను చెయ్యాలనుకొన్న ప్రయత్నాలన్నీ వృథా అని తెలుసుకోడానికెంతోసేపు పట్టలేదు. నా అశక్తతకు నన్ను నేనే నిందించుకున్నాను. చూస్తుండగానే ఆమె ప్రాణం విడిచింది. ఇక అక్కడ ఉండ బుద్ధి పుట్టలేదు. ఇంటికి దారితీశాను. అప్పటివరకూ ఉదాసీనంగా ఉన్న నా ప్రకృతిని సుందరమ్మ మరణం కదిల్చివేసింది.

తరవాత నెల్లాళ్లకి పాపారావు కలకత్తాలో అరెస్టయాడని, సాక్ష్యం బలహీనంగా ఉండడంచేత ఉరి శిక్షమాత్రం తప్పించుకున్నాడని పది సంవత్సరాలు శిక్షపడ్డాడని తెలిసింది. వాడిప్పటికైనా తన జీవితంలో పోగొట్టుకున్నదాని విలువ గ్రహించాడో లేదో! నా విజ్ఞానాన్ని, సామర్థ్యాన్ని ఉపయోగించి వృత్తిధర్మంగా పాపారావుని రక్షించాను. అలా బతికిన పాపారావు రాక్షసత్వానికి అందమైన పువ్వు లాటి సుందరమ్మ జీవితం బలి అయిపోయింది. ఒక గొప్ప కార్యాన్ని సాధించడానికి సన్నద్ధుడైన పాపారావుకు ... సుందరమ్మ సౌందర్య సౌకుమార్యాలు పాపారావులో దానవత్వాన్ని విజృంభింపజేశాయి. దేవుడిచ్చిన వరాల్ని తాను సాధించిన విజయాల్ని మానవుడిలా పాడు చేసుకుంటున్నాడు. ఇందులో ఎవరెవరు ఎంత వరకు బాధ్యులో ఏమో! లేక ఈ ప్రపంచంలో జరిగేవాటికి మంచి చెడ్డలతో సంబంధమే లేదేమో!"

అని డాక్టరుగారు ఆరిపోయిన సిగరెట్టు మళ్లీ ముట్టించారు.

బయట సుందరమ్మ ఆక్రందనలాగా గాలి వాన్, హోరు ఇంకా తగ్గనేలేదు. ★

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | చం | రా |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | శు |
| కే | ర బు | కు | |

**20-11-1964 శుక్రవారము మొదలు**
**26-11-1964 గురువారము వరకు.**

## మేషం :

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

గత వారం కంటే ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు. రావలసిన డబ్బు సమయానికి అందగల సూచనలు ఉన్నాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో అభివృద్ధి ఉంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభించ వచ్చును గాని ఫలితం అంత సంతృప్తి కరంగా ఉండక పోవచ్చును. వ్యాపారంలో పెట్టుబడి చాలని లోపం అప్పుడప్పుడు కన్పించినా మీ సమయస్ఫూర్తి వలన యేదో ఒకవిధంగా సరి పుచ్చుకొంటూ కొంత అభివృద్ధిని సాధించగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో మీరు ఊహించని మార్పులు రావడం వలన మీ కార్యక్రమాన్ని పునరాలోచన చేయవలసి ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో యేర్పడిన చికాకులు చాల వరకు తొలగిపోతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. బంధువుల వ్యవహారాలు ఆందోళన కలిగించవచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)**

ఈ వారం కూడా అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాలు మామూలుగానే జరిగిపోతాయి. వ్యాపారంలో పోటీ వారితో మాట పట్టింపులు రావడం వలన మానసిక ఆందోళన కలగవచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భారీ యెత్తున చేయదలచిన వ్యాపారాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరగవచ్చును. వృత్తి రీత్యా మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో చికాకులు రావడం వలన ప్రస్తుతపు వ్యవహారాల్లో మీరు సాధించవలసినంత అభివృద్ధిని సాధించలేని పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరగడం వలన మిగిలిన కార్యక్రమాల్లో మార్పులు వస్తాయి. ఆరోగ్యం అంత బాగా ఉండదు.

స్త్రీలకు— ఆరోగ్యం అంతబాగా ఉండకపోవచ్చును. కుటుంబ వ్యవహారాలు కొన్ని మార్పులతో నెరవేరతాయి. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

## మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)**

వృత్తి వ్యాపారాల్లో యేవో చికాకులు కల్గేటట్లు కన్పిస్తాయి గాని, మీరు ధైర్యంగా వ్యవహారాలను నడిపించడం వలన చికాకులను అధిగమించడమే కాకుండా తగిన అభివృద్ధిని సాధించగల సూచనలు ఉన్నాయి. ఆర్థిక వ్యవహారాల్లో యేర్పడిన ఒడుదుడుకులు తొలగిపోతాయి. ఉద్యోగంలో మీ ఆలోచనలు ఫలించడానికి తగిన అవకాశాలు లభిస్తాయి. పాటివారితో మాట పలుకుబడి బాగా ఉంటుంది. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షుల హడావుడి పెరిగినా మీ వాదమే జయించడానికి అవకాశాలు యేర్పడతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో మీరు చేసిన వాగ్దానాలను పూర్తి చేయగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ఏ వ్యవహారమూ మీరు అనుకొన్నట్లుగా జరగక పోవచ్చును గాని, జరిగినది కూడా మీకు వ్యతిరేకమైనది కాకపోవడం వలన ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో మీరు యెంత జాగ్రత్తగా వ్యవహరించినా వారం మధ్యలో అనవసరమైన వ్యయం జరుగుతుంది. నూతన వ్యాపారాలు ప్రస్తుతం సామాన్యంగా ఉన్నా ముమ్ముందు విశేషమైన ఫలితాన్ని ఇవ్వగలవు. వృత్తిలో మీ కార్యక్రమాలు కొద్ది మార్పులతో నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు, గృహ నిర్మాణాది కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీరు జరిపే కృషిలో ముందడుగు వేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ఈ వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉన్నా వారాంతంలో కొన్ని చికాకులు కలగడం వలన మీరు అంతవరకు సాధించిన అభివృద్ధి వ్యర్థం కాగల ప్రమాదం ఉంది. వ్యాపారంలో మీ కార్యక్రమాలకు కొద్ది మార్పులు రాగలవు. అధికారుల వలన జరగవలసిన పనులకు ఆటంకాలు రావడం వలన మిగిలిన వ్యవహారాల్లో కూడా కొత్త సమస్యలు తలయెత్త వచ్చును. వృత్తిలో కొంత మంది మిత్రులతోడ్పాటు లభిస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి గత వారంలో కంటే బాగుంటుంది. కొంత మంది వ్యక్తులు తమ స్వార్థాన్ని సాధించుకొనడానికి మిమ్మల్ని వినియోగించుకొనే ప్రయత్నం చేస్తారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత కన్పించవచ్చును. పాటివారితో మాట పట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి.

## కన్య :

**(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా)**

ఇంతవరకు అన్ని వ్యవహారాల్లోను మీకు చేదోడుగా ఉన్నవారే ఇప్పుడు మిమ్మల్ని వ్యతిరేకించడం వలన మీవారెవరో, పైవారెవరో తెలియని పరిస్థితి యేర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు ఈ వారం ఘనవిజయాల్ని యేమీ సాధించలేక పోయినా మామూలుగా జరగవలసిన కార్యక్రమాలు సులువుగా జరిగిపోతాయి. వృత్తిలో ఆకస్మికంగా అధిక వ్యయం చేయవలసిన పరిస్థితి యేర్పడగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీరు ఇతరులకు ఉపకారం చేయడానికి ప్రయత్నం చేయడం వలన మీకు అంతగా ఇష్టంకాని పరిస్థితుల్లో చిక్కుకొనగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీరు యెంత కృషి చేసినా చివరకు నిష్ఫారమే వస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయరాదు. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును.

## తుల :

**(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)**

వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు యేర్పడిన చికాకులు క్రమంగా తొలగిపోవడం వలన మానసికంగా కొంత విశ్రాంతి లభిస్తుంది. వృత్తి వ్యాపారాలు వారం ప్రారంభంలో కంటే వారం ఆఖరున బాగా ఉంటాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో అనుకూలమైన పరిణామాలు కలగవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో కొంచెం లాభించవచ్చును. వృత్తిలో మీ కార్యక్రమాలన్నీ ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. ఉద్యోగంలో మార్పుల కోసం మీరు చేసే ప్రయత్నాలు ఫలించడానికి అవకాశం ఉంది. కోర్టు వ్యవహారాల్లో విశేషమైన మార్పులేమీరావు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో గౌరవం, బాధ్యత కూడా పెరుగుతాయి.

### ఈవారం ధరలు

అపరాల ధరల్లో పెద్ద మార్పులు రావు. నూనె ధర కొంచెం తగ్గుతుంది. పసుపు ధర పెరగడానికి అవకాశం ఉంది. బెల్లం ధరలో ఒడుదుడుకులు రావచ్చును. అలంకార వస్తువుల ధరలు పెరుగుతాయి.

## వృశ్చికం :

**(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయి గాని ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనల వల్ల కేవలం లాభదాయమే కాకుండా భవిష్యత్తులో మీ అభివృద్ధికి కూడా తోడ్పాటు లభించగల సూచనలు ఉన్నాయి. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీ పరిస్థితి గత వారంతో కంటే బాగా ఉంటుంది. ఇంతవరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు వారాంతంలో తిరిగి చేతికి రావచ్చును. స్థిరాస్తి వ్యవహారాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోవడం వలన తగినంత అభివృద్ధిని సాధించగలరు. విద్యా, వైజ్ఞానిక రంగాల్లో మీరు ప్రయత్నం చేసే అవకాశాలు లభించవచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

సామాన్య వ్యవహారాలకు కూడా యెన్నో వ్యయ ప్రయాసలకు గురికావడం వలన, వృత్తి వ్యాపారాల్లో ఆదాయం పెరిగినా కూడా ఈ వారం అంత సంతృప్తికరంగా ఉండక పోవచ్చును. అధికారుల వలన జరుగవలసిన పనులు చాలవరకు నెరవేరి చివరకు ఫలితం చేతికి రాబోయే సరికి యేవో ఆటంకాలు రావచ్చును. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయాస తప్ప ప్రయోజనం ఉండదు. వృత్తిలో కూడా కార్య భారం పెరగగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీరు చేయవలసిన ముఖ్యమైన నిర్ణయాలు ఇప్పుడు చేయడం మంచిది కాదు. ఆరోగ్యం బాగా ఉన్నా మానసికాందోళన కలుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉండవు.

స్త్రీలకు— సాహిత్య కళారంగాల్లో మీ కృషి ఫలిస్తుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

## మకరం :

**(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)**

ఈ వారం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు మిమ్మల్ని మానసికంగా వేధిస్తున్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావడం వలన ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో మీకంటే పెద్దలు కూడా మీ మాటలను మన్నిస్తారు. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే భారీ వ్యవహారాల్లో మీరు ప్రయత్నం చేయకుండానే అనుకూలమైన సంఘటనలు జరగవచ్చును. వృత్తిలో ధైర్యంగా ముందుకు వెళ్ళవలసిన సమయం. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలు జరిపి, అధికారుల ఆదరాన్ని పొందగలరు. ఆరోగ్యం బాగా ఉన్నా బలహీనత కన్పిస్తుంది. వారం మధ్యలో ప్రేమ వ్యవహారాలు చాలా ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— సాంఘిక కార్యక్రమాలకు హాజరౌతారు. శుభ కార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు. విలాస వస్తువులు కొంటారు.

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3పా)**

ఇతరుల దృష్టిలో ఈ వారం మీకు యోగవంతమైనదే గాని మీకు మాత్రం అంత సంతృప్తికరంగా ఉండదు. ఎప్పుడూ పదిమందితో కలసి తిరగడం, అందరూ మీ మాటకు ఓహో అనడం జరుగుతుంది. కాని దానివల్ల మీరు పొందే ప్రయోజనం యేమీ ఉండదు. ఇంతవరకు సన్నిహితంగా ఉన్న వారితోనే డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాల్లో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో మీరు చేసే ప్రయాణాల వల్ల ఫలితం సామాన్యంగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాల్లో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి సమయం కాదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో పూర్తిగా అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉన్నా వారాంతంలో జాగ్రత్త అవసరం. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

## మీనం :

**(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)**

ఈ వారం వృత్తి వ్యాపారాల్లో ఆదాయం సామాన్యంగా ఉన్నా కార్యభారం కొంత తగ్గడం వలన దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే వ్యవహారాలపై దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం లభిస్తుంది. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు కలగవచ్చును కాని వాటివల్ల యే కార్యక్రమమూ నిలచిపోదు. వృత్తిలో సాటివారిలో గౌరవం లభిస్తుంది. ఉద్యోగంలో ఇదివరకు యేర్పడిన చికాకులు చాలవరకు తొలగి పోతాయి. కొంత మంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం కలుగ జేసికొనడం వల్ల శారీరకంగా శ్రమకు గురికావలసివస్తుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయరాదు. ప్రేమ వ్యవహారాల్లో ఆకస్మికంగా కొన్ని చికాకులు రావచ్చును. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. సంతానానికి కించిదనారోగ్యం చేయువచ్చును. ★

# జన్మదిన ఫలం

## నవంబరు-20

అప్పుడప్పుడు అవాంఛనీయములైన పరిస్థితులు యేర్పడినా మొత్తం మీద ఈ సంవత్సరం బాగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. వ్యాపారంలో మీరు ఇదివరకు నిర్లక్ష్యంగా విడిచిపెట్టిన వ్యవహారాలకు ఇప్పుడు ప్రాముఖ్యత రావడంవలన కొంత తొట్రుపాటు కలగవచ్చును. వృత్తిలో అధనంగా వ్యయం చేయవలసిన పరిస్థితి యేర్పడవచ్చునుగాని తగిన ప్రతిఫలం కూడా ఉండడం వలన సంతృప్తికరంగానే ఉంటుంది. ఉద్యోగంలో ఇదివరకు యేర్పడిన భేదాభిప్రాయాలు తొలగి పోతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో పలుకుబడి బాగా ఉంటుంది. బంధుమిత్రులతో మాట పట్టింపులు రావచ్చును. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కావచ్చును.

## నవంబరు-21

ఈ సంవత్సరం జీవితంలో చాలా ముఖ్యమైనది. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్నట్లుగా మీ భవిష్యదభివృద్ధికి కావలసిన ప్రణాళికలు అమలు జరుపడానికి అనువైన సమయం. వ్యాపారంలో ఆకస్మిక ధనలాభం కలిగే సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల కంటే స్వంతంగాచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో ఉన్నతస్థానం లభించడానికి అవకాశం ఉంది. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని సంతానానికి మాత్రం అనారోగ్య సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస యాత్రలు చేస్తారు. ప్రేమ వ్యవహారాల్లో మీరు ఆశించని అనుకూలత లభిస్తుంది. విద్యార్థులకు కొంచెం శ్రమమీద క్లాసు రావచ్చును.

## నవంబరు-22

గడచిన కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఆదాయం పెరుగుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన పనులు విశేషమైన శ్రమ లేకుండా నెరవేరతాయి. వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన విద్యలో ఉత్తీర్ణులు కాగలరు. ఉద్యోగంలో మీ శక్తి సామర్థ్యాలు అధికారుల దృష్టిని ఆకర్షిస్తాయి. ఆదాయం బాగానే ఉన్నా రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన అప్పుడప్పుడు ఇబ్బంది కలుగుతుంది. కోర్టు వ్యవహారాల్లో తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కొన్న తర్వాత విజయాన్ని సాధించగలరు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. కుటుంబ వ్యవహారాలు అంత బాగా ఉండక పోవచ్చును. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## నవంబరు-23

ఏ వ్యవహారంలోను సాహసం పనికిరాదు. వృత్తి వ్యాపారాల్లో, సామాన్య వ్యవహారాలకు కూడా ఎంతో ఆందోళన పొందవలసి వస్తుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో నష్టం రాగల సూచనలు

ఉన్నాయి. రావలసిన డబ్బు కూడా చేతికి వచ్చే వరకు నమ్మడానికి వీలులేదు. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికే వదిలి వేయడం మంచిది. వృత్తిలో పోటీవారితో పోటీ పెరగడం వలన మీ కార్యక్రమాలకు ఆటంకాలు రావచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి అంత బాగా ఉండదు. ఇతరులు చేసిన పొరపాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది. ఎప్పుడూ ఏదో ఒక అనారోగ్యం చేస్తుంది. కుటుంబంలో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. రాజకీయ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. విద్యార్థులు మొదట నుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

## నవంబరు-24

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల విషయంలో మీరు ఇంతవరకు చేస్తున్న ఆలోచనలు ఇప్పుడు కార్యరూపం ధరించడానికి అవకాశం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రాను రాను ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును. వృత్తిలో మున్ముందు బాగా ఉపయోగించే పరిచయాలు లభిస్తాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మాత్రం అంత బాగా ఉండవు. సాంఘిక కార్యక్రమాల్లో నూతన గౌరవం లభిస్తుంది. దూర ప్రయాణాలు చేస్తారు. బంధువులకు సహాయం చేయగలరు. ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## నవంబరు-25

ఈ సంవత్సరం ప్రతి వ్యవహారంలోను ఫలితం మాట ఎలాగ ఉన్నా, ప్రారంభంలో ఎంతో ఆందోళనకు గురి కావలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో ఎన్నో చికాకులను ఒకేసారి ఎదుర్కొనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును. వృత్తిలో ఆదాయం మామూలుగానే ఉన్నా వ్యయం మాత్రం పెరుగుతుంది. ఉద్యోగంలో అననుకూలమైన మార్పులు రావచ్చును. స్థిరాస్తి వ్యవహారాలు మాత్రం కొంచెం బాగా ఉంటాయి. అధిక వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒడుదుడుకులు వస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో బంధువుల తోడ్పాటు లభిస్తుంది. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కాగల సూచనలు ఉన్నాయి.

## నవంబరు-26

ఈ సంవత్సరం ఆర్థికంగా సామాన్యంగా ఉన్నా అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పలుకుబడి పెరుగుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. మీకు అంతగా సంబంధం లేని వ్యవహారాల్లో చిక్కుకొనడంవలన వృత్తిలో మీ చేజిక్కిన అవకాశాలను కూడా వినియోగించుకొనలేని పరిస్థితి ఏర్పడవచ్చును. ఉద్యోగంలో అధికారుల మన్నన లభిస్తుంది. కాని పోటీవారి అసూయకు గురికాగలరు. వ్యాపారంలో కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. ఆరోగ్యం బాగా ఉన్నా దూర ప్రయాణాలు చేయడం మంచిది కాదు. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో నూతన గౌరవం లభిస్తుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును. ★

ఈ రోజుల్లో కాలేజీ కుర్రాళ్ళు రౌడీల్లా ఆడాళ్ళతో కికికిక లాడుతూ పకపక లాడుతూ ఉంటారా వీడు అలాక్కాదే ఆడవాళ్ళను చూస్తే చాలు తల దించుకుని పోతాడు. . . .''

''వూ !''

''ఆ పెద్ద పటకారిలా తేవే !''

పటకారందుకుని జయమ్మ పెసం ఒకసారి క్రిందికి దించింది.



# అయిదు రెళ్ళు

19 వ పేజీ తరువాయి

''బావ బైటికి వెళ్తాడు కాబోలు— ఇప్పుడో రెండట్లు తిని వెళ్తాడేమో అడిగిరావే !'' అంటూ జయమ్మ వెనక్కి తిరిగి గతుక్కుమంది. ఆశ్చర్యపోయింది.

''నువ్వటే శారదా ! కళనుకున్నాను. . . అదేది ?'' అంది.

''వంట్లో బాగోలేదు కాబోలు వెళ్ళి పడుకుంది. అమ్మ నిద్రపోతున్నది. నువ్వు ఒకర్తివే చేసుకుంటున్నావని వచ్చాను. . .'' అని జవాబు చెప్పింది.

శేఖర్ బూట్లు టకటక లాడిస్తూ వంటింటి ముందువరకు వచ్చి ఆగిపోయాడు.

''అమ్మా ! నేను సినిమా కెళ్తున్నానే ?'' అన్నాడు జయమ్మతో.

జయమ్మ ''అట్లు తినివెళ్ళరా !. . . అదేమిటి నువ్వొక్కడివే వెళ్తావా ? మీ మరదళ్ళని కూడా తీసుకెళ్ళు. . . .'' అంది.

శేఖర్ నసిగాడు—

''లేదు లేవే అమ్మా ! నేను నా స్నేహితులతో కలిసి వెళ్తున్నాను. . . .''

''స్నేహితులతో ఇంకో రోజు కలిసి వెళ్ళొచ్చులే'' అంటూ జయమ్మ వంటకట్టిపెట్టి కళ పడుకున్న చోటుకి వెళ్ళింది. కళ క్రింద చాపమీద పడుకుని దూలంకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నది.

''ఏమే కళా ! పడుకున్నావేం ? వంట్లో బాగా లేదా ?'' అంటూ వచ్చి వంటిమీద చెయ్యేసింది జయమ్మ.

కళ కంగారుగా ''బాగానే ఉందత్తా ! తల నొప్పిగా ఉంటే '' అంది కణతలు నొక్కుకుంటూ.

''సినిమా కెళ్తే అదే పోతుంది లే, లే ? బావతో సినిమా కెళ్ళదువు గాని—'' అంది

పక్క గదిలో మంచం మీద పడుకున్న జానకమ్మ కళ్ళు విప్పింది.

''లేచి వెళ్ళవే కళా ! అత్తయ్య చెప్తుంటే ఏమిటదీ ?'' అంది గట్టిగా మందలిస్తూ.

కళ చాప మీది నుంచిలేచింది సబ్బు, తువ్వాలు పట్టుకుని బాత్‌రూం కెళ్తూ ''శారదా ! నువ్వురావూ ?'' అంది.

''రమ్మంటే వస్తాను . . .'' . . అంది శారద.

''బావతో నువ్వెళ్ళరాదూ?.... నాకు ఇంట్లోనే ఉండాలని ఉన్నది.''

శారద మాట్లాడలేదు.

గదిలో అద్దం ముందు నిలబడి పౌడరు రాసుకుంటూ కళ జానకమ్మతో అన్నది.

''శారద వెళ్తుందటమ్మా. చిత్రవస్తే అది కూడా వెళ్తుంది. . . నాకేమిటో ఒకటే తల నొప్పిగా ఉంది—''

'శారద ఇంట్లోనే ఉంటుందిలే బావ ముచ్చటగా పిలుస్తుంటే ఏమిటలా చిన్న పిల్లలా మొండి కేస్తావ్ ?'' అని విసుక్కుంది జానకమ్మ.

కళ నిట్టూర్చింది. ఎవరూ తన వెంట రాక పోటం కూడా ఒకందుకు మంచిదే. . . బావకు అంతా విప్పి చెప్పొచ్చు. . .

కళ ముస్తాబు పూర్తి చేసుకుని శేఖర్‌తో బయల్దేరింది.

''జాగ్రత్తగా వెళ్ళిరండి !'' అంటూ జయమ్మ వాళ్ళని సాగనంపింది.

*　　*　　*

బావతో అసలు విషయం ఎలా కదిపేటో కళకు అర్థం కాలేదు. తోవలో నాలుగైదుసార్లు మాట్లాడబోయింది కాని చేత కాలేదు. శేఖర్ ఏవో, ఇవో మాట్లాడుతూ పక్కనే నడుస్తున్నాడు. కళ ''అవును'', ''కాదు'' అంటూ జవాబులిస్తూ పరధ్యానంగా నడుస్తున్నది. . . . బావ తనమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాడో ? తను కాదంటే ఎంత బాధ పడతాడో ?. . .

సినిమా హాలు దగ్గర మేట్నీ చూసిన జనం గుంపులు గుంపులుగా ఇవతల కొస్తున్నారు. గేటు కివతల, లోపల వేరుసెనక్కాయలు, బఠానీలు అమ్ముకునే వాళ్ళు చకచకా వ్యాపారం సాగించుకుంటున్నారు. అందమైన కార్లు పరుగు లెడుతూ గేటులోపలికొస్తున్నాయి. నైలాన్ చీరలు, ఘుమఘుమ లాడే సెంటు వాసనలు, రంగు రంగుల పూలు, తళుకు తళుకులాడే నగలు, టెర్లిన్ షర్టులు, గాబర్డీన్ సూట్లు, నెక్‌టైలు. . . కోలాహలంగా కేకలు, అరుపులు, సందడిగా మాటలు. . . చక్కని టెక్నీకలర్ టాకీలా కనబడింది.

శేఖర్ టిక్కెట్లు తీసుకొచ్చాక ఇద్దరూ లోపలికెళ్ళి కూర్చున్నారు. ఆటప్రారంభం కావటానికింకా టైం ఉన్నది. రికార్డులువినిపిస్తున్నాయి.

క్రమంగా హాలు నిండి పోతున్నది. కొత్తగా పెళ్ళయిన జంట కాబోలు హుషారుగా, చలాకీగా నడుస్తూ కుర్చీసీట్ల దగ్గర కొచ్చారు. తమ సీట్లను దాటుకుంటూ వెళ్ళి కాస్త దూరంలో కూర్చున్నారు. రెండు జడలు వూగిస్తూ, నవ్వులు చిలకరిస్తూ ఆనంద లహరిలో తేలిపోతున్న ఆ యువతిని చూస్తే కళకు అసూయ వేసింది. తన సరసన బావ బదులు సుధాకర్ ఉంటే తను కూడా అలాగే హాయిగా కేరింతాలు కొడుతూ ఉండేది కదా ?

తన వెర్రి కాకపోతే సుధాకర్‌కు తనింకా జ్ఞాపకం ఉంటుందా ? మగవాళ్ళకి ప్రేమంటే ఏం తెలుసు ? మరో భామ కంటబడితే చాలు పాత సంగతులన్నీ మర్చిపోతారు. వాళ్ళ మాటలు నమ్మి మమకారం పెంచుకోవటం ఆడదాని తప్పు, బలహీనత. తన తప్పుకు బావను మోసం చేయటం దేనికి ? సుధాకర్‌తో పెళ్ళి జరక్కపోతే తనకీ జన్మలో పెళ్ళేవద్దు. ఆ సంగతి చెప్పకపోతే బావ తన మీద ఆశలు పెంచుకుని అధోగతిని పాలుగాక తప్పదు. ఫలించని ఆశలు పతనానికి దారితీస్తాయి.

కళ నీరసంగా నిట్టూర్చింది.

శేఖర్ ''ఇంకా తలనొప్పి సర్దుకోలేదా ?'' అనడిగాడు జాలిగా.

కళ తల అడ్డంగా తిప్పింది. కాస్సేపు తటపటాయించి గొంతుక సవరించుకుని మెల్లిగా మాట్లాడింది.

''బావా ! నేనంటే నీ కిష్టమా ?. . . .''

ఎదురు చూడని ఈ ప్రశ్నతో శేఖర్ తికమక పడి అర్థరహితంగా నవ్వాడు.

''ఇదేం ప్రశ్న ?. . . ఎందుకిష్టం ఉండదూ?'' అన్నాడు చివరికి.

కళ కుర్చీని దృఢంగా నొక్కి పట్టుకుంటూ "కాని నా కిష్టం లేదు. . . ." అంది.

శేఖర్ తెల్లబోయాడు.

చెప్పవలసిన దానికి నాంది ప్రస్తావన జరిగింది. ఇప్పుడింక కళకు వెనకటి భయమంతా దూది పింజలా ఎగిరి పోయింది.

"నిజంగా చెప్తున్నాను. నాకీ పెళ్ళి ఇష్టం లేదు. . . అత్తయ్య నన్ని ఇంటి కోడలిగా చూస్తున్నది. నువ్వూ అలాగే అనుకుంటున్నావేమో కూడా. . . . అందరూ నీ ఇష్టం సంగతి ఆలోచిస్తారు కాని నాకు ఇష్టమున్నది, లేనిదీ కనుక్కోరు— ఈ సంగతి చెప్దామనికే నేను నీతో సినిమా కొచ్చాను" అంది ఘాటుగా.

శేఖర్ నిట్టూర్చాడు.

"నా ఇష్టం మాత్రం ఎవరు కనుక్కున్నారు నువ్వు తప్ప !" అన్నాడు.

కళ ప్రశ్నార్థకంగా శేఖర్ ముఖంలోకి చూసింది.

"నాకూ ఈ పెళ్ళి ఇష్టం లేదు !" అన్నాడు శేఖర్ తేలిగ్గా శ్వాస విడుస్తూ.

అందంగా ఉన్న వాళ్ళకి అతిశయం ఎక్కువ. ఎంత సేపూ ఆ అందానికి మెరుగులు దిద్దుకోవటంలోనే వాళ్ళకి రోజంతా గడిచి పోతుంది. మరొక ధ్యాసే ఉండదు. ఆడవాళ్ళకి ఇష్టమైనవి రెండే రెండు— డబ్బు, పొగడ్తలు— ఆ రెండూ తను కళ కివ్వలేదు. అదీగాక అధికారం చెలాయించే ఆడవాళ్ళకు దూరంగానే ఉండాలి. . .

శేఖర్ జవాబుతో కళ అహంభావం దెబ్బతిన్నది. బావ ఈ విషయాన్ని ఇంత తేలిగ్గా తీసుకోగలడని తను కలలో కూడా అనుకోలేదు. తనలాంటి అందాల రాశి వద్దంటే బావ విలవిలలాడి పోడా అనుకుంది తను—

"నిజంగా ?" అనడిగింది కళ అనుమానంగా చూస్తూ.

"ముమ్మాటికీ నిజం ! నిన్ను పెళ్ళిచేసుకునే వాడు అదృష్టవంతుడైతే కావచ్చు కాని నాకా అదృష్టం అక్కర్లేదు. . . ."

కళ తేలిగ్గా ఊపిరిపోయింది. . . అహంభావం దెబ్బతిన్నా బావ తనను పెళ్ళి చేసుకోమని బలవంతం చెయ్యనందుకు మనస్సు కృతజ్ఞతతో నిండి పోయింది. . . .

"ఎవరినన్నా ప్రేమించావా బావా ?" అంది మెల్లిగా, మందహాసం చేస్తూ.

"ఆ మాటే విన్నాడికిలేనో ?" అంటూ శేఖర్ నవ్వాడు.

కళ సిగ్గుపడి ఊరుకుంది.

లైట్లు ఆరిపోయాయి. ఆట ప్రారంభ మయింది. . .

కళ సినిమా ధ్యాసలో పడింది. ముందు వరసలో తన ఎదుటి కుర్చీలో కూర్చున్న మనిషి అప్పుడప్పుడు తనకేసి చూస్తున్నాడు. పోకిరీ వెధవ అని తిట్టుకుంది కళ. —

ఇంటర్వెల్‌లో లైట్లు వెలిగాయి. హాల్లో మళ్ళా సందడి ప్రారంభమయింది. కొంత మంది లేచి బైటికెళ్తున్నారు. ముందు వరసలో తన సీటు కెదురు కూర్చున్న వ్యక్తి కూడా హడావిడిగా బైటికి వెళ్తున్నాడు. కళ అతన్ని చూసి ఉలిక్కి పడింది. మోహన్ ! ఇక్కడికెలా వచ్చాడు ?. . . .

అతన్ని కనుక్కుంటే సుధాకర్ సంగతులేమైనా తెలుస్తాయి. . . .

కళ కంగారుగా లేచి బైటికొచ్చేసరికి మోహన్ కనబడలేదు. ఆట మొదలయ్యాక మళ్ళా ఎలాను వస్తాడు కాబట్టి అప్పుడే అడగొచ్చు ననుకుని కళ మళ్ళా లోపలికొచ్చి కూర్చుంది.

శేఖర్ బైట కిళ్ళీషాపు దగ్గర సిగరెట్టు కాలుస్తూ నిలబడ్డాడు. . . సన్నగా, చలాకీగా కనబడుతున్న ఆ మనిషెవరో తన వెండుకలా చురచురా చూస్తూ పోతున్నాడు ? ఎక్కడా చూసిన గుర్తులేదే ? తనకు, అతనికి శత్రుత్వం ఏమిటి ? చిత్రంగా ఉన్నదే అనుకున్నాడు శేఖర్.

మళ్ళా ఆట ప్రారంభం అయింది కళకు సినిమా మీద లేదు. మోహన్ వస్తాడని చాలాసేపు ఎదురు చూసింది. కాని అరగంట దాటినా ఆ సీటు ఖాళీగానే ఉండిపోయింది. కళ మనస్సు ఉసూరుమంది. హాలంతా చీకటిగా, భయంకరంగా కనబడింది. తెరమీది బొమ్మలు పెనుభూతాల్లా కనబడ్డాయి. కళ చటాలున కుర్చీలో నుంచి లేచింది. శేఖర్ కళ వెంట వెళ్ళాడు.

సుధాకర్ ఎందుకని ఉత్తరం వ్రాయలేదు ? తనకు వ్రాస్తే బాగుండదని ఆలోచించాడా ? లేకపోతే తన మీద కోపం వచ్చిందా ?. . . బావ ఉన్నాడని తెలిసిన దగ్గర్నించి అతనికి తన మీద అనుమానంగానే ఉన్నది ! తన ఆరాధ్య దైవం బావ కాదని అతనికి మనస్సు విప్పి చెప్పలేక పోయింది. చివరకు వీడ్కోలిస్తూ 'బావ ధ్యాసలో నన్ను మర్చిపోవు కదా ?' అని సుధాకర్ జాలిగా అన్నప్పుడు కూడ తను జవాబేమీ చెప్పలేక పోయింది. ముఖం దాటు చేసుకుని కన్నీరు మాత్రం కార్చింది. ఒకసారి సిగ్గు, మరోకసారి దుఃఖం రెండుసార్లూ తన ప్రేమను వ్యక్తం చెయలేక పోయింది. సుధాకర్ తనను అపార్థం చేసుకోలేదు కదా ?

శేఖర్ ఉన్నట్లుండి అడిగాడు.

"కళా ! నువ్వు నా కంటె పొడుగనుకుంటాను" కళ నవ్వింది.

"అవునేమో ! నేను ఫైవ్‌ఫీట్ ! నీ హైటెంత"

"నా కంటే అరంగుళం తక్కువే నన్ను మాట."

"పై నుండి చూసి నా కంటే ఎంతో పొడుగను కున్నాను ! ఆడవాళ్ళు ఎంత దగా చేస్తారు ?" అని నవ్వాడు శేఖర్.

కళకు మెరుపులా ఒక ఆలోచన తట్టింది.

"చాలా థాంక్సు ! అత్త పొగడీసి అడిగితే నువ్వు నా కంటె పొట్టి అని తప్పించుకుంటాను.." అంది హుషారుగా.

ఇంటికి వెళ్ళేసరికి "అప్పుడే అయిపోయిందా సినిమా ?" అంటూ ఆశ్చర్య పోయింది జయమ్మ.

వరండాలో పక్కలు పరచి ఉన్నాయి. ఒక మూల పూర్వశి పడుకుని ఉంది.

శేఖర్ వరండా మెట్ల మీద కూర్చుని బూట్లు విప్పుకుంటూ "ఇంగ్లీష్ సినిమాలు విన్నవే ఉంటాయిలేవె. . . ." అన్నాడు.

కళ లోపలికెళ్తూ 'అబద్ధాలు ఆడ్డంలో బావ నేర్పరే' అనుకుని నవ్వుకుంది. కనీసం మూడున్నర గంటలకు తక్కువాడని తెలుగు సినిమా సగం దాకా చూసి వచ్చారు.

శేఖర్ సరాసరి కుక్క దగ్గరకెళ్ళి దాన్ని ముద్దు పెట్టుకున్నాడు. జయమ్మ సినిమా కథేమిటని అడిగితే చూసినంత వరకు చెప్పుకొస్తున్నాడు. ఇంతలో కాలిమీద ఏదో కరిచినట్టయింది బాధగా ఇటు తిరిగేసరికి పూర్వశి తెరిచి ఉన్న గేటు లోనుంచి పరిగెత్తి పారిపోయింది. రక్తం కారటం లేదు కాని కాలు మీద పంటి ఆనవాళ్ళు కనబడుతున్నాయి. రక్తం కారలేదు కాబట్టి రేపొద్దున్నే ఆస్పత్రి కెళ్ళి చూపించుకుంటే మించి పోయేదేమీ ఉండదని ఆలోచించుకున్నాడు శేఖర్.

జయమ్మ ఖాళీగా ఉన్న స్తంభంకేసి చూస్తూ "కుక్కేదిరా ?" అనడిగింది కంగారుగా.

"గొలుసు తెంచుకుని పారిపోయింది. . . ."

కాలు పట్టి కూర్చున్న శేఖర్‌ను చూసి జయమ్మ గాభరా పడింది.



"అనేమిటిరా ? కాలు పట్టుకున్నావ్ ? కుక్క కాని కరవలేదు కదా ?"

నిజం తెలిస్తే రాత్రికి తనను నిద్రపోనియ్యడు. అందుకని గభాలున లేచి "అబ్బే ! ఎదెందుకు కరుస్తుంది ?. . . దాన్ని వెతికి పట్టుకొస్తాను. . ." అంటూ బైటికెళ్ళాడు.

ముద్దుగా, శ్రద్ధగా చూసుకుంటున్న పూర్వశి కరిచేసి పారిపోయింది. కుక్కలు విశ్వాసమైన

## అయిదు రెళ్ళు

వంటారు ! పూర్వశి కుక్కజాతికే అప్రతిష్ట తెచ్చింది కదా ?

శేఖర్ గబగబా నడవలేక మెల్లిగా సందు ఈ చివరి నుంచి ఆ చివరి వరకు వెళ్ళొచ్చాడు. రోడ్డంతా ఖాళీగా ఉన్నది. పూర్వశి కాదు కదా మరో కుక్క కూడా కనబడలేదు. పూర్వశికి తనకు ఋణం తీరిపోయింది. .

శేఖర్ ఇంటికొచ్చి మాట్లాడకుండా ప[...] కున్నాడు.

కళకు నిద్రపట్టలేదు. . . చిత్ర ఒక సినిమా తార ఫోటో చూసి పెన్సిల్‌తో రేఖలు గీస్తూ పోలికలు తేవటానికి ప్రయత్నిస్తున్నది. [...] మనస్సంతా అల్లకల్లోలంగా ఉన్నది. మోహ[...] తనను చూసి కావాలనే కనబడకుండా వెయ్యాడా[...]

తనేం అపకారం చేసిందని ? సుధాకర్‌ను గురించి వాళ్ళని కబుర్లేమైనా చెబుతాడేమోనని తాను ఆశ పడింది. తన ఆశ ఫలించలేదు. మనస్సు నిస్పృహాయంగా రోదిస్తున్నది.

కళ బాధను అణుచుకోలేక "చిత్రా! ఇవ్వాళ మోహన్ కనిపించాడు.— నన్ను చూడగానే దొంగలా పారిపోయాడు..." అని చెప్పింది మెల్లిగా.

చిత్ర ఒక్కక్షణం పెన్సిల్ కదపకుండా ఉంచి "సినిమాల్లో చేరాలని తల్లక్రిందులవుతున్న మోహనేనా? మన ఇంటికోమాటు వచ్చాడూ ?" అంది.

కళ తల వూపింది.

రెండు రోజులక్రితం గేటుతలుపులు తీసుకుని బైటకెళ్తూ చిత్ర ఇంటి ముందర తచ్చాడుతున్న మోహన్ని చూసింది. ఫలానా అని గుర్తుపట్టింది. కాని అతనితో పరిచయం లేనుకాబట్టి ఏమాట్లాడకుండా తన దారిని తాను వెళ్ళింది. బహుశా కళ, అతను. . . లేకపోతే వైజాగ్ ఎందుకొచ్చినట్లు ? రోడ్డుమీద నడుస్తూ ఉంటే తనవెనకాతలే ఎవరో వస్తున్న అలికిడి విని వెనక్కితిరిగిచూస్తే మోహన్ కనబడ్డాడు. తనవెనక బడతాడెందుకు ? చిత్రకేం అర్థంకాలేదు? కాస్సేపయాక చూస్తే మోహన్ కనబడలేదు. పోకిరీవెధవ అని తిట్టుకుంది చిత్ర.

ఇప్పుడు కళ వాడి సంగతి ఎత్తటంతో అసలు సంగతి కాస్త కాస్త అర్థమవుతున్నది.......పోయి పోయి కళ వాడినికాని ప్రేమిస్తున్నదో, ఏమిటో కొంపదీసి !

"వాడా వట్టి పోకిరీ వెధవ ! సినిమా వాళ్ళకి నీతి నియమాలుండవు ....వాడిని గురించి అట్టే ఆలోచించకు !" అని సలహా ఇచ్చింది చిత్ర.

కళ హృదయం మూలిగింది. మాట్లాడకుండా వెళ్ళి పడుకుంది.......

* * *

మర్నాడు శేఖర్ ఆస్పత్రికెళ్ళి చూపిస్తే కుక్క కరిచినట్టు మునిసిపాలిటీ వాళ్ళ దగ్గర్నించి సర్టిఫికేట్ వ్రాయించుకుని తెస్తే ఇంజక్షన్ ఇస్తామన్నారు. మునిసిపల్ ఆఫీసుకెళ్ళి సర్టిఫికేటు ఇయ్యవయ్యా అని అడిగితే ఆ గుమస్తా "నీకు కుక్కే కరిచిందో, చీమే కరిచిందో నా కెలా తెలుస్తుందయ్యా ?" అని కసురుకున్నాడు. లౌకిక జ్ఞానంతో ఆ పని తొందరగా సానుకూల పరుచుకుని ఆస్పత్రికెళ్ళాడు శేఖర్. ఒకటి కాదు రెండుకాదు పద్నాలుగు ఇంజక్షన్లు తీసుకోవాలట బొడ్డు చుట్టూ.

ఇంజక్షన్ తీసుకుని ఇంటికొచ్చాడు శేఖర్. బాధగా మంచంమీద పడుకున్నాడు. జయమ్మ గిలగిలలాడిపోయింది.

"దిక్కుమాలిన కుక్క జోలికి నువ్వెందుకు పోయావురా నాయనా ?" అంటూ దిగులుగా మంచం పట్టుకుని కూర్చుంది.

"వేడి నీళ్ల కాపడం పెడితే అదే సర్దుకుంటుందత్తా !" అంది శారద స్టౌమీద నీళ్ళ పడేస్తూ.

నీళ్ళ వేడిగా మరిగాక శారద నీళ్ల గిన్నె, తువ్వాలు మంచం దగ్గరకు తీసుకొచ్చింది. జయమ్మ తువ్వాలు నీళ్లలో ముంచి, గట్టిగా పిండి పొట్టమీద పెట్టింది.

"అమ్మో !" అంటూ తువ్వాలు తోసేసాడు శేఖర్.

జయమ్మ మళ్ళా రెండు మూడుసార్లు కాపడం పెట్టబోయింది. కాని శేఖర్ తువ్వాల్ని దగ్గరికి రానివ్వలేదు.

"మరెలారా నీతో ? వాటర్ బేగ్ కొనమంటే కొనవు...... ఉండు ! రాధమ్మ దగ్గర ఉన్నట్టుంది. వెళ్ళి తీసుకొస్తాను........" అంటూ జయమ్మ వెళ్ళింది.

జయమ్మ అలా వెళ్ళగానే "కాపడం పెడతావా శారదా ?" అనడిగాడు శేఖర్.

"అత్త పెడితే వద్దన్నావుగా ?"

"అమ్మకి, నీకు పోలికేమిటి? నీకు బాగా వచ్చు..."

శారద నవ్వి తువ్వాలు చేతిలోకి తీసుకుంది. శారద కాపడంపెడుతూ ఉంటే శేఖర్ "కుక్క విశ్వాసంకల జంతువంటారు. పూర్వాశి చూడు ! ఇన్నాళ్ళూ నాతో ఉంటూ ఇప్పుడు నన్ను కరిచేసి కనబడకుండా పారిపోయింది....అన్నిటికీ ఒక రూలు దీనికో రూలు !" అన్నాడు విచారంగా.

"వూర కుక్కకి రూలేమిటలే బావా !" అని సమాధానపరచబోయింది శారద.

శేఖర్ ఒప్పుకోలేదు.

"వూర కుక్కా ? పూర్వాశి పరువునష్టం దావా వెయ్యగలదు—"

"నీ మాట నిజమే ! పూర్వాశి స్వర్గలోకంలో ఉంది కాబట్టి సరిపోయిందికాని లేకపోతే ఈ పాటికి నీమీద పరువునష్టం దావా వేసుండేది !......" అని నవ్వింది శారద.

"అమ్మయ్యో ! గట్టిదానివే మాటలే రావనుకున్నాను......." అని నవ్వాడు శేఖర్.

శారద మాట్లాడకుండా కాపడం పెడుతున్నది.

"పోనీ వూరకుక్కే అనుకో ! .......'కుక్క విశ్వాసంకల జంతువు' అని ఒకటో క్లాసునుంచి చదువుకుంటాం కదా ..... కుక్కంటే కుక్కే. వూర కుక్కకో రూలు, బొచ్చుకుక్కకో రూలూనా ?"

"అవును ! దేని రూలు దానికే ! కాకపోతే 'పాము క్రూరమైన జంతువు' అని రాసుకుందని వాన పామునుచూసి జడుసుకుంటావేమిటి ? వానపాము త్రాచుపాము రెండూ పాములే అయినా రెండిటికీ తేడాలేవా ?" అని వివరించింది శారద.

శేఖర్ శారద చెయ్యిపట్టుకుని నలిపేశాడు.

"భేష్ శారూ! నువ్వు లాజిక్ చదువుకుంటే నిమిషంలో పైకి వచ్చేదానివి......మరి నువ్వు చదువెందుకు మానేశావ్ ?"

"మానేసానని ఎవరు చెప్పారు ? మొన్న ఫ్రెండ్ వరితో 'విశారద' కెళ్ళాను నీకు తెలీదా ?"

ప్రభుత్వం హిందీ నేర్చుకోమని ఘోష పెడుతున్నది. శారద బుద్ధిమంతురాలే....అయినా ఇంగ్లీష్‌రాని చదువేం చదువు ? వాసనలేని పువ్వులా, బొట్టులేని అందగత్తె మోములా, శీర్షికలేని వార్తలా.........

"హిందీ చదువుకోవటం మంచిదే శారూ. కాని కనీసం ఎస్.ఎస్.ఎల్.సి. అయినా చదువుకోకపోతే ఏం బాగుంటుంది ?......." అన్నాడు మెల్లిగా నచ్చ చెప్పుతున్న ధోరణిలో.

"నాకా ఇంగ్లీషురాదు బావా ! అందుకే థర్డ్ ఫారమ్‌తో ఆ చదువు కట్టిపెట్టాను......."

"ఎందుకు రాదూ ? రోజూ నేను నేర్పుతాను.... నేర్చుకుంటావా ?"

శారద ఒక్క క్షణం తటపటాయించింది.

"నేర్చుకుంటే వస్తుందంటావా ?"

"ముదితల్ నేర్వగరాని విద్య కలదె ముద్దార నేర్పించినన్.......ఏమైనా ఆడదానికి రాలేదూ అంటే దానర్థం నేర్పిన వాళ్ళు మొద్దులన్నమాట !"

జయమ్మ వాటర్ బేగ్ పట్టుకొచ్చింది.

"బాధ సర్దుకున్నదికాని వాటర్ బేగ్ ఇచ్చెసిరా !" అంటూ శేఖర్ మంచంమీది నుంచి దిగిపోయాడు.

(సశేషం)



కె. వి. గోపాలరత్నం

# ఆంధ్రప్రదేశ్ క్రికెట్ యోధులు

రాజకీయరంగంలోనే కాక క్రీడారంగంలో కూడా ఆంధ్రులు ప్రముఖ స్థానంలోనే ఉన్నారు. క్రికెట్‌లో తొలి ఇద్దరు టెస్టు నాయకులైన సి. కె. నాయుడు, మహారాజకుమార్ విజయానగరం ద్వారా ఆంధ్రా తొలిస్థానాన్ని ఆక్రమించింది. ఆంధ్ర నుండి మూడవవాడుగాను, భారత దేశం నుండి పదవవాడుగాను గులామ్ అహ్మద్ కేప్టెన్ అయినప్పుడు తిరిగి ఈ ఆధిక్యత ఇంకొకసారి బుజువైంది. భారత దేశానికి క్రికెట్ కేప్టెన్‌లు 14 మందిలోనూ ముగ్గురు ఆంధ్రులు టెస్టు పోటీలలో దేశం తరపున ఆడిన 108 మందిలోనూ యేడుగురు ఆంధ్రులు.

## క్రికెట్‌కి తగ్గవారు

క్రికెట్ క్రీడకు ఆంధ్రులు సరిపోయినవారని సి. కె. వంటి ప్రఖ్యాత వ్యక్తి శ్లాఘించి ఉన్నారు. ''మంచి ఒడ్డూ పొడుగూ ఉన్న ఈ ప్రాంతపు వ్యక్తులు'' క్రికెట్ ఆటగాళ్ళుగా చక్కగా రాణించ గలరని ఇతను ఒకసారి అన్నారు. క్రికెట్ క్రీడకు సరిపోయే ముఖ్య లక్షణాలన్నీ వీరిలో ఉండడమే తాని మాట అనడానికి కారణమని ఇతను వివరించారు. సి. కె. ఇంకా ఇలా అన్నారు : ''ఆంధ్రులు బాగా కలివిడిగా ఉంటారని ప్రతీతి. దేశంలో ఈ మూల నుండి ఆ మూల వరకూ చెల్లాచెదరుగా ఉన్నప్పటికీ వీరు హాయిగా జీవించ గలుగుతున్నారు. ఆంధ్రాలో ఈ ఆట భవిష్యత్తు ఆశాజనకంగా కనిపిస్తోంది. తగిన శిక్షణ ప్రోత్సాహం లభిస్తే 'ఫ్లేనల్స్' ధరించే అర్హత పొంద దగిన యువకులు యెందరో ఉన్నారు. ప్రకృతి సిద్ధంగా తీక్షణమైన చూపు, చురుకైన శరీరం, శక్తి ఉన్న ఆంధ్రులు వారి సామర్థ్యాన్ని చూపిస్తే క్రికెట్‌లో మిగతా వార్ని అధిగమించగలరు.''

1954—55లో రంజీట్రోఫీ గెల్చుకున్న కీర్తి కాంతిలో ప్రకాశిస్తూనే ఉన్న మద్రాసు జట్టును 1957లో చిత్తుగా వోడించి ఆంధ్రా జట్టు తన క్రికెట్ ప్రావీణ్యతను బుజువు పరుచుకున్నది. భారతదేశానికి స్వాతంత్ర సిద్ధి యెంత ముఖ్యమో, ఆంధ్రాకు స్వరాష్ట్రసిద్ధి అంత ముఖ్యమైనది. అదేవిధంగా క్రీడారంగంలో 1952 లో మద్రాసు టెస్టులో ఇంగ్లాండ్ వోటమి, 1959 కాన్పూర్ టెస్టులో ఆస్ట్రేలియా తిరోగమనం యెంత ముఖ్యమో, 1957 లో మద్రాసు జట్టు విజయం అంతే ముఖ్యమై, చరిత్రలో ముఖ్య ఘట్టంగా రూపొందింది. రెండు దశాబ్దాలపాటు అపజయాలను పొందిన తర్వాత భారత దేశం ఇంగ్లాండ్ పైన, ఆస్ట్రేలియా పైన విజయం సాధించ గలిగింది. ఇంకా పసి తనంలో ఉన్నప్పుడే ఆంధ్రా తన విజయాన్ని పొందింది.

## సి. కె. నాయుడు

ఆంధ్రా క్రికెట్ రంగానికి పుష్టినిచ్చి, గౌరవాన్ని కలిగించడానికి కారణమెవరు ? ఈ ప్రశ్నకు జవాబుగా మొట్ట మొదట స్ఫురించే పేరు సి. కె. క్రికెట్ రంగంలో ఇతని విజయ విహారాలు యెన్నో ! ఆటపైన ఆసక్తికల వ్యక్తులందరికీ ఈ వివరాలు పూర్తిగా తెలుసును. తెలుగు నాట క్రీడాంగణాలలో రంజీ, దులీప్ యెప్పుడూ పాల్గొనలేదు. అందువల్ల మన క్రికెట్ రంగపు ప్రఖ్యాత ఆటగాడు సి. కె. అని నిస్సందేహంగా చెప్పవచ్చును. రవీంద్రనాథుని కవిత్వ గంభీరత, సరోజిని కవిత్వపు గానమాధుర్యం సి. కె. బేటింగ్‌లో కనిపిస్తాయి. నాయుడు క్రీడాంగణంలో ఉంటే ''వికెట్ల మధ్య వినిపించే సంగీతానికి'' నెవిల్లీ కార్డస్ మురిసి పోవడంలో ఆశ్చర్య మేముంది. రాజకీయ రంగంలో బెనర్జీలు, గోఖలేల కంటె యెక్కువగా, రంజీ తన బేట్‌తో భారతదేశానికి యెక్కువ కృషి చెశారని ఎ. జి. గార్డ్నర్ అన్నాడు. ఇంగ్లాండ్‌లో ఈ విధంగా రంజీ ఘన ఫలితాలను సాధించాడని అంగీకరిస్తే, ఆ నాడు క్లైవ్ మొదలైన వారు యెంతో ప్రయాసపడి భారత దేశంలో నిర్మించిన బ్రిటిష్ రాజ్యపు పునాదులను సైతం దేశంలో గడగడ లాడించిన వ్యక్తి సి. కె. బొంబాయిలో ఎ. ఇ. ఆర్. గిల్లిగన్ యొక్క ఎమ్. సి. సి. పోటీలో 100 నిముషాల ఆటకు '11 సిక్సెస్' '13 ఫోర్స్'తో సహా 153 పరుగులు సాధించి, చిరస్థాయి అయిన కీర్తితో పాటు, సి. కె. పై ఫలితాన్ని సాధించారని చెప్పవచ్చును. దేశపు కీర్తిని హిమాలయ శిఖరాల ఔన్నత్యానికి లేపిన ఈ చర్య, సి. ఇ. ఎర్ల్ యొక్క 133 పరుగులకు సమాధానం. బ్రిటిష్ సామ్రాజ్య భవనపు ముఖ్య స్థంభాలలో క్రికెట్ ఒకటని ప్రతీతి. అందువల్ల సి. కె. సాధించిన ఈ విజయం ఇంగ్లాండ్ భవిష్యత్తుకు తొలి సూచనగా రూపొందింది.



సి. కె. నాయుడు "11 సిక్సర్లు"

## విజ్జీ

''సమయం కోసం యెదురు చూచేవారు కూడా బ్రహ్మాండమైన సేవచేస్తా''రన్నది నిజమే అయితే దేశపు రెండవ కేప్టెన్ అయిన విజ్జీ కూడా బ్రహ్మాండమైన సేవ చెశారు. ఇరవయ్యవ పడిలో తొలి సంవత్సరాలప్పుడు, తన ప్రఖ్యాత ప్రారంభకులు (ప్రస్తుతం సర్) జాక్ హాబ్స్, హార్బర్ట్ సట్క్లిఫ్, (ప్రస్తుతం సర్) లియరీ కాన్‌స్టన్‌టైన్‌లను స్వంత ఖర్చులతో ఆహ్వానించి, తరచుగా ఈ క్రీడకు ఆర్థిక సహాయం చేసి, ఇతను క్రీడోత్సాహాన్ని పెంపొందింప జేశారు. మూడు దశల వయసులో ఇతను టెస్టు పోటీలకు భారత దేశపు కేప్టెన్ అయ్యారు.

నలభయ్యవ ఏట కామెంటేటర్ అయ్యారు. ఏభయ్యవ యేట ప్రవేశించిన తర్వాత ఈయన 'బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ఫర్ క్రికెట్ ఇన్ ఇండియా'కు అధ్యక్షులై, తన పదవీ కాలంలో రెండు ముఖ్యమైన పనులు జరగడానికి కారణమయ్యారు. మొదటిది సి. కె. నాయుడు షష్టి పూర్తి సందర్భంలో సుమారు 25,000 పర్సు బహూకరించారు. రెండవది బీదవాళ్లు, అనాధులు అయిన క్రికెట్ ఆటగాళ్ళ సంక్షేమనిధి. ఏభై యేళ్ళు పూర్తయ్యే సమయానికి, క్రికెట్ జాతుల సంఘంలో ఇంపీరియల్ క్రికెట్ కాన్ఫరెన్స్, ఇండియా పాకిస్తాన్, న్యూజిలాండ్, వెస్ట్ ఇండీస్‌కు సమాన ప్రతిపత్తి కల్పించడానికి కృషి చేసి, సఫలత పొందారు. అప్పట్లో ఇంగ్లాండ్, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికాలకు ఈ సంఘంలో రెండు వోట్లు ఉండాలి. పై నాలుగు దేశాలకు ఒక్కొక్క వోటు మాత్రమే ఉండేది.

## సి. ఎస్. నాయుడు

బంతిని ఆకాశమంత యెత్తుకు పంపడంలో సి. కె. అద్వితీయుడైతే అతని తమ్ముడు కొట్టారి సుబ్బయ్యనాయుడు, బేట్స్‌మన్ యొక్క ఆశలను భమ్ము చెయడంతో ఆనందం పొందేవాడు. పడిపోతున్న స్టంపుల 'టకటక' నుండి వచ్చే శబ్దం దేవగానమే అయ్యేది. అందువల్లనే విమర్శకులు ఇతన్ని 'భారతదేశపు గ్రిమ్మెట్' అనే వారు. 1944లో హోల్కర్—బొంబాయిల మధ్య రంజీ ట్రోఫీ జరిగినప్పుడు 152.5 వోవర్లలో, అంటే



గులామ్ అహ్మద్—'ఆఫ్ బ్రేక్'

917 బంతులలో 11 వికెట్లు పడగొట్టి ఇతను గ్రిమ్మెట్‌నే అధిగమించారు. అప్రూపమైన శక్తి గల సి. ఎస్. 'మానవ రూపంలో ఉన్న యంత్రమా' అనిపించేటట్లు బంతి తర్వాత బంతిని పంపిస్తూ ఉండేవారు. అదృష్టదేవత ఇతన్ని వరించి ఉంటే ఇతని పాటవంతో రికార్డు పుస్తకాలు నిండిపోయి ఉండేవి. ఫీల్డర్‌గా కూడా సి. ఎస్. కు మంచి ఖ్యాతి ఉన్నది. బ్యాంక్ ఆఫ్ లండన్‌లోని లాకర్స్‌లో కంటె ఇతని చేతుల్లో బంతి భద్రంగా ఉంటుందని ప్రతీతి.

## సి. రామస్వామి

కలకత్తాలో 1933—34లో డి. ఆర్. జార్డన్ ఎమ్. సి. సి.తో పోటీ చేస్తూ సి. ఎస్., ముస్తాక్ ఆలీలు తొలిసారి టెస్టు రంగంలో అడుగు పెట్టారు. భారతదేశం తరఫున టెస్టు పోటీలో ఆడిన వారిలో వారు అతి చిన్నవయసు వారని పత్రికలలో పతాక శీర్షికలు వెల్లడి చేశాయి. సి. రామస్వామి కూడా పతాక శీర్షికలలో కనిపించారు— వయసు మించిన వ్యక్తి కావడంవల్ల! క్రికెట్ ఆటగానికి 40 యేళ్ళంటే ఆ రంగంలో సూర్యాస్తమయం క్రిందలెక్క. కాని రామస్వామికి అది సూర్యోదయమైంది.

ఆటగాళ్ళ కుటుంబంలో పెరిగిన రామస్వామి మొట్టమొదట టెన్నిస్‌ను వరించారు! తన ప్రేమను అక్కడ్నుంచి మళ్ళించుకొనే వేళకి ఇతనికి వయసు ముదిరి పోయింది. మంచి 'బేట్స్‌మన్' అని ఇతని పేరు మాంచెస్టర్‌లో ప్రతిధ్వనించింది. 1958—59 లో భారత దేశం వెస్ట్ ఇండీస్ చేతుల్లో చిత్తుగా ఓడిపోవడం వల్ల ఇతని ఆటగాళ్ళను యెన్నుకొనే ప్రతిభ దెబ్బ తిన్నది. దానికి తోడు అమరనాథ్ తో తీవ్ర వివాదాలలో చిక్కుకోవడం వల్ల ఇతను రంగం నుండి విశ్రమించవలసి వచ్చింది.

## గులామ్ అహ్మద్

హృదయపూర్వకమైన వాంఛ ఉండి, కృషి చేసిన వ్యక్తి అత్యుత్తమ స్థానాన్ని చేరుకోవడం అంత కష్టం కాదు. శ్లాఘనీయమైన ఈ లక్షణం గులామ్ అహ్మద్‌లో కన్పిస్తుంది. కలుపుగోలుతనం, ఉత్సాహం, చిరునవ్వుతో ప్రకాశించే ముఖం గల ఈ వ్యక్తిని చూచినప్పుడు ఇతను ప్రపంచంలో ఉత్తమమైన 'ఆఫ్ స్పిన్నర్' అని ఊహించలేరు. ఈ విధానంలో ఇతనికంటె ఘనులు లేరు. దక్షిణ ఆఫ్రికాకు చెందిన హ్యూగ్ టెఫీల్డ్ కాని, ఇంగ్లాండుకు చెందిన జిమ్‌లేకర్ కాని ఇతనికి సమానులు కారు. మలన్, వెర్‌వార్డ్ మొదలైన అత్యధిక పాటవం గల వ్యక్తులు ఉన్నందువల్ల అసలు టెఫీల్డ్ విషయం పరిశీలించనే అక్కరలేదని నా నమ్మకం. లేకర్ కంటె గులామ్ ఘనుడని చెప్పడానికి మనకి ఆస్ట్రేలియన్ విమర్శకుడు రే రాబిన్‌సన్ అభిప్రాయం ఉన్నది. బెన్ బెర్నెట్ రజతోత్సవ కామన్‌వెల్త్ సీజ్ క్రికెట్ జట్టుతో భారత దేశంలో పర్యటించిన రెగ్ థాంప్సన్, గులామ్ బౌల్ చేస్తున్నప్పుడు అతి జాగ్రత్తగా, శ్రద్ధగా బంతిని ఆడడానికి సిద్ధ పడినప్పటికీ, మరుక్షణంలో బంతి అతన్ని దాటుకొని వచ్చి, 'ఆఫ్ స్టంప్'ను పడగొట్టిన సంఘటన చూసే అదృష్టం నాకు కలిగింది. ఇంకా అచంచలమైన శక్తివంతుడైన ఉన్నప్పటికీ, ఈ క్రీడాకారుని సేవ భారత దేశానికి లభించడానికి వీలు లేకుండా ఇతడు 'రిటైర్' అయిపోవడం దురదృష్టకరం. ఇతని విశ్రమణతో భారత క్రికెట్ రంగం వెలవెల పోయింది.

## కొత్త నీరు: జయసింహా, బేగ్‌లు

ఇక హైదరాబాద్ 'కవలలు' ఎమ్. ఎల్. జయసింహా, అబ్బాస్ అలీబేగ్‌లు. క్రికెట్ క్రీడోపాసకులకు మక్కా వంటిదైన 'లార్డ్స్'లో క్రికెట్ నామకరణం పొందిన జయసింహా, ప్రారంభపు ఆటగాడు కావాలన్న భారతదేశపు ప్రార్థనలకు వరంగా అవతరించాడని చెప్పవచ్చును. తగినంత జాగ్రత్త, దుడుకుతనం సమపాళ్ళలో చేర్చి, ముస్తాక్ అలీ కాలం తర్వాత చూచి యెరగని పద్ధతిలో ఇతను 'బౌలింగ్'కు యెదురు నిలుస్తాడు. బంతిని తిరిగి 'బౌలర్'కు పంపే పద్ధతిలో బేట్‌ను అడ్డుగా పెట్టుకొనే విధానం కాక, యెదిరి దాడిని యెదిరించి కొట్టడం అన్న విధానం ఇతనిది. దీనికి తగిన ధైర్యం కూడా ఇతనికి ఉన్నది. అంతే కాకుండా 'ఫీల్డర్'లు లేని ప్రాంతం చూచి అటువైపు బంతిని పంపించే కళలో కూడా ఇతను సమర్థుడు. ట్రెవర్ బెయిలీ వలె బేటింగ్‌ను, బౌలింగ్‌ను కూడా జయసింహా ప్రారంభించగలడు. టెస్టు పోటీలో అయిదు రోజులూ బేట్ చేసిన బేట్స్‌మన్ ప్రపంచంలో ఇతను ఒక్కడే అనుకుంటాను. బ్రహ్మాండమైన ఫీల్డర్ కూడా కావడంతో ఇతను తన జట్టుకు పెట్టని కోట.

డిశంబర్ 1960 లో ఆస్ట్రేలియాలో జరిగిన ఢిల్లీ టెస్టు పోటీలో బేగ్ ఆట నాకు కొంత నిరాశ కలిగించిందని చెప్పాలి. ఇంగ్లాండు నుండి ఇతను తిన్నగా ఈ పోటీకే వచ్చారు. బంతిని సరిగా చూడలేక ఇతను అతి 'పాకగా' విశ్రమించారు. మాంచెస్టర్‌లో ఇతను ఆడిన ఆట, టెస్టు క్రికెట్‌లో తన ప్రవేశాన్ని వంద పరుగులతో ప్రారంభించుకొని, అమర్‌నాథ్, దీపక్‌శోధన్, క్రిపాల్‌సింగ్ వంటి వారి కోవకు చెంది చూపించిన పాటవం మరుపురానిది కావడం వల్లనే నాకీ ఆట నిరాశ కలిగించింది. ఎన్నో పరుగులు, గురి తప్పని పాటవం చూడవచ్చునని నే వాశించాను. అయితే ఇంగ్లాండులో సూర్యకాంతి ఇక్కడంత మిరుమిట్లు గొలుపుతూ ఉండదని, బహుశా అందువల్లనే ఇంగ్లాండు నుండి అప్పుడే తిరిగి వచ్చిన కారణం వల్ల బేగ్ సక్రమంగా బంతిని గమనించలేక పోయాడని విజయ మర్చెంట్ అన్నారు. అయితే సర్ లియొనార్డ్ హట్టన్ వంటి ప్రపంచ ప్రఖ్యాత బేట్స్‌మన్‌కే రేలింద్వాల్‌కు భయపడకుండా, సగం దూరం బంతికి యెదురేగి, అందుకొని, బేగ్ దాన్ని 'ఫోర్'లోకి పంపించడంతో నాకు యెంతో ఉత్సాహం కలిగింది. బొంబాయిలోని ఒక సుందరి బేగ్‌ను ముద్దు పెట్టుకుందంటే యెవరు మాత్రం ఈర్ష్య పడగలరు!

ఆంధ్రా, ఢిల్లీ విశ్వవిద్యాలయాల కేప్టెన్ లైన కె. వెంకటరమణమూర్తి, సనమూరి బాలాజీ రావుకు, అదృష్టంతప్ప క్రికెట్ రంగంలో కావలసిన అన్ని హంగులూ ఉన్నాయి. ఆంధ్రా జట్టుకు చుక్కాని అని చెప్పదగ్గ మూర్తి బంతిని కొడుతూ

56 వ పేజీ చూడండి



జయసింహా! కొత్తనీరు

# హృదయ కుసుమాలు



### జ రి గి న క థ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాధను చెపుతూవుంటుంది... ఎన్నెన్నో అపవాదులకూ, నానా అగచాట్లకూ గురి అయిన అక్కయ్య జీవితం విషాదాంతమవుతుంది. ఆ ఇంట మిగిలిన పసివాడు బాబుకు ఆదరణ, బావకు మనశ్శాంతీ కావాలి. కాలేజీలో చదువుతున్న సీతను, బావ రమారావునే వివాహం చేసుకోమని ఆమె తలిదండ్రులు అడుగుతారు. కాని ముందు చదువు పూర్తి చేయాలంటుంది సీత.

## 15

'బావ' అక్కయ్య భర్త. అక్కయ్య పోయింది గనక, అమ్మ చెప్పింది గనక నా జీవితం బావతో ముడి పెట్టుకోవాలి. ఇది అమ్మ కోరిక. అక్కయ్య పరిస్థితులు విన్న అమ్మ ఆ రోజుల్లో 'దాని గొంతు కోశామని' విచారపడి కృంగి పోయింది. ఆ బావే ఈ రోజున అమ్మ దృష్టిలో నాకు తగిన వాడని పించాడు. ఇదంతా కట్టుబియ్యలేని పరిస్థితుల్లో మనస్సును సమాధాన పర్చుకుని తెచ్చి పెట్టుకున్న ఆత్మవంచన. పెళ్ళిళ్ళ విషయంలో కన్నెచెర వది లించుకోటానికి కట్న కానుక లివ్వలేని కన్యాదాతలు ఎంత ఆత్మవంచన కయినా సిద్ధపడతారు. లోక సహజమే అది.

అక్కయ్య గారింట్లో ఉన్నన్నాళ్ళూ బావను గౌరవ దృష్టితో నే నెప్పుడూ చూడలేదు. అక్కయ్య కోసం, దానికాపురం సరిదిద్ద దల్చుకున్న రీతుల్లో బావతో అనేక విషయాల్లో వాగ్వాదం పెంచుకున్నానే గాని గౌరవ ప్రదమైన సానుభూతి వాక్యాలతో ఎక్కువగా మాట్లాడలేదు. అసలు బావ నన్ను చేసుకోటానికి ఇష్టపడి ఉంటారా! ఇష్టపడితే ఏదో ప్రమేయంతోనయినా నాకు ఒక్క ఉత్తరమైనా రాయలేదు. ఇదంతా పెద్ద వాళ్ళ ప్రోద్బలమా లేక బావ అంగీకారం కూడా తీసుకునే వచ్చారా? నా ప్రాణంకన్న కూడా అక్కయ్యని మిన్నగా ప్రేమించాను. దాని సుఖమే నా సుఖ మనుకున్నాను. అలాంటి అక్కయ్య పోగానే దాని స్థానం నేనెట్లా ఆక్రమించేది. రోజూ అక్కయ్యను తల్చుకుంటూ కుమిలి పోటం తప్ప, దాని స్థానంలో నేను ప్రవేశించి బావ హృదయంలో చోటు చేసుకో గలనా. అంత ఎత్తిపొడుపు మాటలతో తర్క వితర్కాలతో బావతో మాట్లాడిన నేను భార్యగా గృహిణిగా బావతో కాపురం చెయ్యగలనా. భర్తగా ఆయన్ని గౌరవించగలనా. ఇష్టాలుగా ఆదరించ గలనా. ఆ రోజుల్లో మీ అక్కయ్య తరఫున లట్లా నాతో వాదించావు. మరదలువు కాబట్టి నీ మీద నాకేమీ అధికారం లేకపోయింది. ఇప్పుడు నువ్వు నా భార్యవు. అన్ని విషయాల్లోనూ నా అభిప్రాయాలకు అనుగుణంగానే నువ్వు మసులు కోవాలి, అంటూ నన్ను మరింత చులకనగా చూస్తే?

ఏమిటో ఎంత ఆలోచించినా ఒకే నిర్ణయా నికి రాలేక పోయాను—

నాలుగు రోజులు గడిచినయ్. సాయంత్రం కాలేజీ నుంచి ఇంటికి రాగానే నాన్న నా చేతికొక

ఉత్తరం ఇచ్చారు. సుభద్ర రాసిందేమో అని అనుకున్నాను. ఆశ్చర్యం. బావ రాసిన ఉత్తరం. బావ నాకు ఉత్తరం రాయటమేమిటా అని ఆశ్చర్యపడ్డాను. ఆదుర్దాగా ఉత్తరం చదివాను.

సీతా,

మనఃపూర్వక ఆశీర్వచనములు. ప్రతివారూ జీవితంలో ఏ ఒడుదుడుకులూ లేకుండా సుఖ సంతోషాలతో కాలం గడిచి పోతున్నంత వరకూ, అంతా తమ ప్రతాపమేనని అనుకుంటారు. దానికి వ్యతిరేకంగా ఏవయినా ఇబ్బందులు కలిగినప్పుడు మన రోజులు బాగుండలేదని అనుకుని విచార పడ్డం మానవ సహజం. ప్రస్తుతం నేనూ ఈ పరిస్థితుల్లోనే ఉన్నాను.

నీతో, నా కష్ట సుఖాలను గురించి మనస్సు విప్పి చెప్పుకోవాలని నా కోరిక. నా మనస్సులోని ఈ అవ్యక్త వ్యథను వెల్లడించటానికి బాధ పడుతున్నాను. కాని నీతో చెప్పుకుంటే కాస్త మనశ్శాంతయినా ఉంటుందేమోనని నా ఆశ. మనకు సన్నిహితులయిన వారితో, మనచుట్టూ తిరిగే వారితో జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక పని తగులుతుందనే భావం సామాన్యంగా కలుగదు. ఎందుకంటే వారి కన్న కొంత పైకగా మనం మసులుగా ఉండటం నుంచి. సాక్షీ భావంతో చూసిన అలాంటి వ్యక్తి వద్దకు పోయి యాచించవలసి వచ్చినప్పుడు మన అంతరాత్మను ఎంత చంపుకోవాలో నాకు ఇప్పుడు అర్థమవుతున్నది.

నా మనసువిప్పి నీతో ఎన్నో సంగతులు మాట్లాడాలి. అవి మిత్రుడుగా అర్థిస్తున్నాను. బావగా అడగటంలేదు. నా మనస్సును అర్థంచేసుకున్న ఆడపడుచువి గనుక ప్రార్థిస్తున్నాను. మరదలుగా నీతో చనువుగా ఎగతాళిగా మాట్లాడదలుచుకోలేదు. నీకు ఇష్టమైతే, వీలయితే వచ్చే శని, ఆదివారాల్లో ఇక్కడికి మా ఇంటికి రావలసిందిగా ఆహ్వానిస్తున్నాను. అమ్మా, నాన్నా ఉన్నారు. సుభద్ర నీ రాకకు ఎదురుచూస్తున్నది. బాబు పిన్నికోసం వెతుక్కుంటున్నాడు. ఎప్పుడు వచ్చేది వెంటనే జాబు రాస్తావు గా సీతా !

రామారావు.

ఉత్తరం చదివాక రెండు నిమిషాలు అట్లాగే నిలుండిపోయాను. కళ్ళు చమరించాయ్యి. అమ్మా, నాన్న నా గదిలోకి వచ్చారన్న సంగతే మర్చిపోయాను. నాన్న ఉత్తరం తీసుకుని మళ్ళీ చదువుకుని,

"ఏమ్మా సీతా ! గుంటూరు వెళ్ళివస్తావా" అన్నారు.

"అంతగా రాస్తుంటే వెళ్ళిరా తల్లీ. వాళ్ళు మనింటికి వచ్చి వెళ్ళారు కదా. నువ్వు వెళ్ళినంత మాత్రంలో తప్పేముంది" అన్నది అమ్మ.

"ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తానమ్మా. ఇప్పుడేమీ చెప్పలేను" అన్నాను.

అమ్మా, నాన్న మరేం మాట్లాడలేదు.

బావ నాతో ఏం మాట్లాడతారు. నాతో చర్చించవలసిన సంగతులేం ఉంటాయ్యి. ఒక్కటే నిర్ణయం తనను చేసుకోటానికి నా అభ్యంతరమేమిటో తెల్సుకోవాలనే. అంతకన్నా మరేముంటుంది. ఎంతో ఆలోచించినమీదట గుంటూరు వెళ్ళటానికే నిశ్చయించుకున్నాను. శనివారం ఉదయం వస్తున్నానని సుభద్రకు ఉత్తరం రాశాను.

గుంటూరు స్టేషనులో రైలు దిగి రిక్షాలో వెళుతుంటే ఏమిటో చెప్పలేని ఆవేదనతో గుండెలు కొట్టుకోసాగినయ్యి. ఇదివరకు వెళ్ళేటప్పుడు ఎప్పుడెప్పుడు వెళ్ళి అక్కయ్యను చూద్దామా అనిపించేది. అక్కయ్యకోసం మనస్సు సంతోషంతో, హృదయం ఉత్సాహంతో పరవళ్ళు తొక్కేది. నవ్వుతూ గుమ్మంలో రిక్షా దిగేదాన్ని. ఇప్పుడు రిక్షాలో కూర్చుంటే, రిక్షా ఇంత తొందరగా పోతున్నదేమా అనిపిస్తున్నది. నేనెందుకు వెళ్ళాలి. ఎవరి కోసం వెళ్ళాలి ? ఎవర్ని చూట్టానికి వెళ్ళాలి ? అక్కయ్య బ్రతికి ఉంటేనే అది బావగారిల్లు. అక్కయ్యగారిల్లు. అక్కయ్య పోయాక పరాయి ఇల్లు. బావకాదు, రామారావుగారు. ఆ రామారావుగారి ఇంటికి నేనెందుకు వెళ్ళాలి ? తిరుగుబండిలో ఏలూరు వెళ్ళిపోదామనిపించింది. ఆలోచిస్తుండగానే రిక్షా ఇంటి ముందు ఆగింది. రిక్షా చప్పుడు విని సుభద్ర బైటికి వచ్చింది. ఆప్యాయంగా పలకరించి నా చెయ్యిపట్టుకుని ఇంట్లోకి తీసుకువెళ్ళింది. ముందు హాల్లో అడుగు పెడుతూనే హఠాత్తుగా ఆగిపోయాను. గుమ్మానికి పైన అక్కయ్య పెద్ద సైజు ఎన్లార్జిమెంట్ ఫోటో. కళ కళలాడుతూ విప్పారిన ముఖంతో నావైపు చూస్తూ నన్నే పలకరించినట్టుగా ఉంది. ఒక్కసారిచూసి తలవంచుకున్నాను. అప్రయత్నంగా కళ్ళు తుడుచుకున్నాను. ఇంట్లోకి వెళుతుంటే అక్కయ్య జీవితంలో నేను ప్రవేశిస్తున్నానా అనిపించింది. బాబుకు పాలు పడుతూ సుభద్ర తల్లి కూచునుంది.

"రామ్మా రా. నువ్వొచ్చినందుకు చాలా సంతోషం. కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళివ్వు సుభద్రా" అన్నది సుభద్రతో.

ఎంతలో ఎంతమార్పు. అక్కయ్య ఉన్న రోజుల్లో నేనే దొడ్లోకి వెళ్ళి బావిదగ్గర కాళ్ళు కడుక్కుని వచ్చేదాన్ని. వంటింట్లో వచ్చేసరికి అక్కయ్య మంచి నీళ్ళిచ్చి "ఏమే సీతా, కులాసాగా ఉన్నావా. అమ్మా నాన్న కులాసాగా ఉన్నారా" అని ఆప్యాయంగా పలకరించి మాట్లాడేది. ఇప్పుడు పరాయిదాన్ని. చుట్టాన్ని.

బావ గదిలోనుంచి వచ్చారు. కుశలప్రశ్నలు వేశారు. బావవైపు చూశాను. చాలా మారిపోయారు. చిక్కిపోయారు. ముఖంలో కళాకాంతులు తగ్గినయ్యి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లే ఉంటారు. మనసులో బాధపడుతున్నట్లే కనపించారు.

పాలు పట్టటమయ్యాక బాబుని ఎత్తుకున్నాను. నా ముఖంలోకి తేరిపార జూస్తూ నా వేళ్ళో గొలుసు పుచ్చుకుని గుంజసాగాడు. బాగా వళ్ళుచేశాడు. తెల్లగా, పచ్చగా, పుష్టిగా ముద్దులు మూటకట్టేటట్టున్నాడు. ఎందుకు ఉండడు. తల్లిని మింగినవాడు. తల్లిని దూరం చేసుకున్నవాడు. తల్లి ప్రేమకు నోచుకోనివాడు. తల్లంటే ఎవరో ఎరిగనివాడు. అలాంటి నిర్భాగ్యుడికి ఆరోగ్యమయినా లేకపోతే ఎట్లా ? ఆ తల్లి ఆయుర్దాయం కూడా వాడిదే.

* * *

భోజనాలయాక బావ గదిలో కూర్చుని నన్ను పిల్చారు. నాకా గదిలోకి వెళ్ళటానికి మనస్కరించలేదు. ప్రతిచోటా, ఇల్లంతా అక్కయ్య కలయ తిరుగుతున్నట్టుగానే ఉంది. ఆ గదిలోనే అక్కయ్య, బావ, రమాదేవి, కూర్చుని ఎన్నో కబుర్లు చెప్పుకున్నాము. రమాదేవి తన పరిస్థితులను చెప్పినప్పుడు అక్కయ్య ఎన్నో హితోక్తులు చెపుతూ, పౌరుషంగా, జాలిగా అక్కడే చెంగు పరుచుకుని పడుకున్న సంఘటనలు గుర్తుకొచ్చినయ్యి. మొదటి రోజుల్లో ఆ గదిలోనే బావ చేతుల్లో అక్కయ్య దెబ్బలు తిన్నది. అక్కయ్య, బావ ఉండవలసిన ఆ గదిలోకిపోలేకపోయాను. గుమ్మంముందు నిల్చున్నాను.

"రా సీతా. అట్లా కుర్చీలో కూర్చో" అన్నారు బావ.

"ఇట్లా నిల్చుంటాలే బావా. మరేం ఫరవాలేదు. పిల్చారెందుకు" అన్నాను. బావ ఏమనుకున్నారో ఏమో!

"అట్లా వరండాలో కూర్చుందామా" అన్నారు. తల వూపాను. ఇద్దరం వరండాలో కూర్చున్నాం.

"ఏం సీతా. ఉత్తరం రాసినందుకు కోపమొచ్చిందా" అన్నారు బావ.

"కోపమెందుకు బావా. ఉత్తరంలో తప్పేం లేదే"

"బాబుని చూశావా"

"చూశాను. ఎత్తుకున్నాను. కాస్త వళ్ళుచేసి బావే ఉన్నాడు".

"సీతా"

తలెత్తి చూశాను. బావ ఏదో చెప్పబోయి ఆగిపోయారు.

"మూర్ఖంగా ప్రవర్తించి మీ అక్కయ్యని శాశ్వతంగా దూరంచేసుకోవటమేగాక, మీ అందరి మనస్సులూ కష్టపెట్టాను సీతా ! నన్ను గురించి మీ మనస్సుల్లో ఏర్పడిన దురభిప్రాయం ఇంకా అట్లాగే ఉందా సీతా" అన్నారు.

"ఏ అభిప్రాయమైనా కాలానుగుణంగా, అప్పటి పరిస్థితులనుబట్టి ఏర్పడేదేగాని శాశ్వతంగా నిల్చిపోయేది కాదు. కాకపోయినా ఒకరికోసం మరొకరు తమ అభిప్రాయాలను ఎందుకు మార్చుకోవాలి బావా." అన్నాను

బావ నావైపు ఒక్కసారిచూసి ముఖం తిప్పేసుకున్నారు.

"మంచివారయినా చెడ్డవారయినా బాంధవ్యాన్నిబట్టి ఆ వ్యక్తియందు మనకుగల గౌరవ ప్రపత్తులు వెల్లడించుకుంటాము. బాంధవ్యం తెగిపోయాక ఆ వ్యక్తియందు మనకుగల అనుభవాలనునుంచి ఏర్పడ్డుకున్న అనుభూతులు మాత్రమే మెదులుతూ ఉంటాయ్యి. అంతేగాని దురభిప్రాయపడవలసిన అవసరమేముంది బావా" అన్నాను మళ్ళా.

"పి.యు.సి. అయ్యాక ఇంకా చదువుతావా సీతా"

"చదవాలనే ఉంది. కాని సాగాలిగా. నాన్న కొచ్చే జీతంలో నాకు పెద్ద చదువులు ఏంచెప్పిస్తాడు. అయినా పరీక్షలయి పాసయినాక సంగతి".

"బాబుని పెంచటానికి వీలులేక మా అమ్మ సతమతమైపోతోంది. ఒక్క పురిటి కష్టం మినహా మా అమ్మే పిల్లాడి తల్లిగా వాడితో అవస్థపడుతోంది. పెద్దతనంలో ఆవిడకు ఇదొక బాధా, అవస్థ".

"రమాదేవి కాస్త సాయంచేస్తున్నదిటగా. రమాదేవికి మారిను అయినాడా బాబు".

"నిజంగా రమాదేవి వాడి పోషణ విషయంలో అవస్థపడుతూనే ఉంది. కాని సీతా......"

"ఏమిటి బావా".

"మన మనిషంటూ ఒకరుంటే లోటుపాట్లన్నీ చెప్పి వాడి పోషణ విషయంలో ఇంకా శ్రద్ధ తీసుకో వచ్చు."

"పోనీ........." అర్థోక్తిలోనే ఆగిపోయాను. నాకేమిటో మాట పెగిలి రాలేదు.

"వివాహం చేసుకోమంటావా సీతా."





# హృదయ కుసుమాలు

"బాబుకి తల్లి లేని లోటు తీర్చరా మరి."

"కొంతకాలం కాపురంచేసి, హృదయంలో, మనస్సులో స్థాన మేర్పరచుకుని భర్తని తీర్చి దిద్దుకునే భార్య ఈ లోకాన్ని శాశ్వతంగా విడిచి పోతే ఆ భర్త హృదయంలో అగాధ మేర్పడు తుంది. మరో పెళ్లి చేసుకున్నా ఆ అగాధాన్ని శాశ్వతంగా పూడ్చలేకపోవచ్చు. పైపెచ్చు ఆ అగాధమే ఇంకా కట్టలుతెగి పెద్దదయి మానసికంగా కృంగ దీయవచ్చు. పునర్వివాహం చాలా కష్టతర మైనది. సీతా." అన్నారు బావ.

నాకు ఆశ్చర్యం కలిగింది. బావకు మళ్లా పెళ్లి చేసుకోటానికి యిష్టంలేకపోతే పెద్దవాళ్లు ఆరోజున ఎందుకు ఏలూరు ఎందుకు వచ్చినట్లు ? బావ అభిప్రాయం తెల్సుకోకుండానే పెళ్లి విషయాలు ఆలోచించటానికి వచ్చారా ? అనుకున్నాను.

"నీ అభిప్రాయం తెల్సుకుందామని ఉత్తరం రాశాను సీతా !"

"నా అభిప్రాయాని కేముంది బావా. పెళ్లి చేసుకునేది నువ్వు. బాబుని కన్న తండ్రి నువ్వు. వాడి మంచి చెడ్డలు ఆలోచించవలసింది నువ్వు. మధ్యలో నా అభిప్రాయంతో పనేముంది బావా" అన్నాను.

బావ ముఖం చిన్నబుచ్చుకున్నట్లయింది.

"సీతా ! అన్నీ తెలిసే యిట్లా మాట్లాడతావేం. నువ్వు బాబుకి తల్లివి కావాలని నా కోరిక. తరువాత నీ అభిప్రాయం ఆలోచించుకుని చెప్పు సీతా. నన్ను స్వీకరించటానికి నీకు యిష్టంలేదా. నీ అభిప్రాయం తెల్సుకుందామనే పిలిపించాను. ఆఖరి క్షణంలో జానకి అన్న మాటలు గుర్తు తెచ్చుకో" అన్నారు బావ.

నా గుండెల్లో రాయి పడినట్లయింది. బావ ఈమాట అడుగుతారని తెల్సు. దానికి ఏం సమాధానం చెప్పాలో ఎంత ఆలోచించినా నా మనస్సుకు తట్టలేదు.

"అంత తొందరగా చెప్పలేని సంగతి" అంటూనే కుర్చీలోంచి లేచి సుభద్ర ఉన్న గదిలోకి వెళ్లాను. మా మాటలన్నీ ఆలకిస్తూ కూర్చుంది సుభద్ర.

సుభద్రతో మాట్లాడలేకపోయాను. ఎన్నో ఆశలు తన మనస్సులో నింపుకుని, ఎన్నో అనుభవాలను చవిచూడాలనే ఆశతో, ఆదర్శ గృహిణిగా అక్కయ్య ఆ యింట్లో అడుగుపెట్టింది. ఆ ఇంటి ఇల్లాలిగా అక్కయ్య ఆ యింట్లో తిరుగుతుంటే అందరికీ చూడ ముచ్చటగానే ఉంది. కొత్త కాపురంగా ఎన్నో అనుభూతులు పుణికి పుచ్చుకోవా లనుకుంది. అక్కయ్య ఆశలు అడియాస లయి నయ్యి. బావ అన్నట్లుగా భార్య పోయిన భర్త హృదయంలో నిజంగా అఘాతమే ఏర్పడుతుంది. ఆ అఘాతాన్ని రెండవ భార్య పూడ్చకలదా ? అందు లోనూ ఒకళ్లిద్దరి పిల్లల పెంపకం కూడా రెండవ భార్య నెత్తిన పడితే ఎంత ప్రేమతో ఆ పిల్లలను చూసుకున్నా రెండో పెళ్లి పెళ్లామనే ఈర్ష్యాభావం చాలామందికి కలుగుతుంది. ఈ స్థితి లోకి నేనూ రావాలన్నమాట. ఈ స్థితికి నేను రాగలనా ? వచ్చినా బావ మనస్సు నాయందు లగ్నమై ఉంటుందా ? బావ నన్ను ప్రేమించ గలరా ? కేవలంగా బాబు పోషణ భారం నామీద వెయ్యటానికే ఈ నిశ్చయాని కొచ్చారా ? పెళ్లి కాని రోజుల్లో నేను తనతో సిగ్గు భిడియాలు లేకుండా మాట్లాడానని అక్కయ్యమాదిరే నామీదా ఏదో అభాండం వేస్తే ? అసలు అక్కయ్య కోసం ఎన్ని మాటలో, ఎన్ని కష్టాలో పడాలను కున్న నేను, ఈరోజున అక్కయ్య పోగానే బావకు భార్యను కాగలనా ? అక్కయ్య బ్రతికున్నప్పుడే, ఆ రోజుల్లో నా మనస్సంతా అక్కయ్యతో లగ్నమై పోయుండేదే ! ఈరోజున ఆ స్థానాన్ని నేను ఆశించటమా ? నేను బావను చేసుకుంటే అక్కయ్య ఆత్మ శాంతిస్తుందా ? అసలు అక్కయ్య కోరిక ఇదేనా ? అక్కయ్య భర్తగా, బావగా, రామారావు బావగా నా మనస్సులో చిత్రించుకున్నానే గాని, కల్లోనయినా ఆయన భార్యగా ఉండాలని ఎప్పుడూ అనుకోలేదే ?—ఇట్లా ఆలోచించాను.

ఎంత ఆలోచించినా నా మనస్సుకు ఏ సమాధానం దొరకలేదు. ఒక్కసారి నిట్టూర్పు విడిచి అటు చూచేసరికి రమాదేవి కనిపించింది. ఎప్పు డొచ్చి నిల్చుందో అక్కడ. కళ్లు తుడ్చుకుని రమాదేవి చెయ్యి పుచ్చుకుని కుర్చీలో కూర్చోపెట్టాను.

"ఎప్పుడొచ్చావు సీతా." ఆప్యాయంగా అడిగింది రమాదేవి.

"నే వచ్చేసరికి పదిగంటలయింది రమా. కులాసాగా ఉన్నావా. బాగా చదువుకుంటున్నావా" అన్నాను.

రమాదేవి మాటలు విని ఉయ్యాల్లో పడు కున్న బాబు తల ఎత్తి రమాదేవివైపు చూస్తూ "ఊ, ఆ" అంటూ పలకరిస్తూ ఎత్తుకోమని కాళ్లూ, చేతులూ తన్నుకుంటున్నాడు. నావైపు చూసింది రమాదేవి.

"ఎత్తుకో రమా. నువ్వంటే వాడికి ఎంతో యిష్టం. చూడు. కళ్లార్పకుండా నీవైపు ఎట్లా చూస్తున్నాడో" అన్నాను.

రమాదేవి కుర్చీలోంచి లేచి వెళ్లి ఉయ్యాల్లో పిల్లాడ్ని ఎత్తుకుంది. వాడు కేరింతలాడుతూ రమాదేవి చేతుల్లో ఉండిపోయాడు. అక్కయ్యకా అదృష్టం లేకపోయింది.

ఏమిటో ఆలోచిస్తూ కూర్చుండిపోయాను. మా అందర్నీ చూస్తూనే బావ బట్టలు వేసుకుని వెళ్లిపోయారు. రమాదేవితో మరేం మాట్లాడాలో నాకు తోచలేదు.

"నువ్వు పిలువు సీతా బాబు నీ దగ్గర కొస్తా డేమో." అన్నది రమాదేవి. చేతులు చాచి బాబుని పిలిచాను. వాడు నావైపోసారి, రమాదేవి వైపోసారి చూసి ముఖం తిప్పేసుకుని రమాదేవి గుండెలకి అతుక్కుపోయాడు. నవ్వుతూ "చూశావా సీతా, వాడికి నేనంటేనే యిష్టం" అన్నది రమాదేవి.

"పసివాళ్లు నాల్గురోజులు తెల్సు. నాలుగురోజులు సీత ఎత్తుకుంటే యింక ఆవిడ దగ్గరా అలవా టవుతాడు" అన్నది సుభద్ర. వాడి రెండు చేతులూ పుచ్చుకుని నా దగ్గరకు రమ్మని పిల్చాను. వాడు నవ్వుటూ రమాదేవిని వదల్లేదు.

"పిన్నిరా. పిన్ని దగ్గరికి పోరా వెధవాయ్" అన్నది సుభద్ర. వాడూ నవ్వుతూ రమాదేవి వైపే చూశాడు.

కాసేపు ఏవో కబుర్లు చెప్పుకున్నాం. రమా

లేని వెళ్ళిపోతూ వాళ్ళింటికి రమ్మన్నది. సాయంత్రం వస్తానని చెప్పాను. రమాదేవి వెళ్ళాక సుభద్ర అన్నది. "కనీసం రోజుకోసారయినా రమాదేవి వచ్చి వెళుతుంది. బాబంటే ఎంతో ముద్దు. తను ఉన్నంతసేపూ వాడిని ఎత్తుకునే ఉంటుంది. ఎందుకో అంత ఆపేక్ష వాడంటే" అన్నది.

"సహజంగా పిల్లలంటే కొంతమందికి ముద్దు. తల్లిలేని పిల్లాడనే జాలిచేతనైనా రమాదేవి వాడ్ని ఎత్తుకోవచ్చు. పిల్లాడ్ని రమాదేవి ఎత్తుకుంటే బావ ఏమీ అనరా" అన్నాను.

"ఏమీ అనడు. రమాదేవితో మాట్లాట్టమే లేదు అన్నయ్య. రమాదేవి రాగానే ఏదో పనిమీద అన్నయ్య బైటికి వెళ్ళిపోతాడు. రమాదేవి కూడా ఏం మాట్లాడదు" అన్నది సుభద్ర.

ఇవేం మనస్తత్వాలో నా కర్థంకాలేదు.

*　　　*　　　*

సాయంత్రం నాలుగ్గంటలకు రమాదేవి ఇంటికి వెళ్ళాను. కృష్ణవేణి లేదు. సగం ఆదుర్దా తగ్గింది. రమాదేవి మేడమీదనుంచే నన్ను చూసి గబగబా కిందికి వచ్చింది. ఇద్దరం మేడమీదికి వెళ్ళాము. చెరో కుర్చీలో కూర్చున్నాము.

"మీ వదినగారు కులాసానా రమా."

"ఆ కులాసానే. ఆవిడ చెల్లెలు జ్యోతి మీకు తెల్సుగా."

"ఆ మా యింటిదగ్గరే. అప్పుడప్పుడూ యిక్కడికి మీ యింటికొస్తుం దనుకుంటా."

"వస్తూనే ఉంటుంది. అక్కచెల్లెళ్ళిద్దరూ ఒకటే. ఇద్దరి స్వభావాలూ, భావాలూ ఒక్కటే ఎవరిమీదో ఒకరిమీద అభాండాలు వెయ్యందే వాళ్ళకు నిద్రపట్టదు."

రమాదేవి ముఖంలో మునుపటి చలాకీతనం, జీవితమాధుర్యమూ కనిపించటంలేదు.

"జ్యోతి యిక్కడికి వచ్చి వెళ్ళినప్పుడల్లా ఏదో ఒక కొత్త పుకారు లేవదీస్తూనే ఉంటుంది. మొదట్లో బాధపడ్డాను. తరువాత జ్యోతి స్వభావమే అటువంటిది కావాలనుకున్నాను. ఇతరుల మనస్సుని కష్టపెట్టి వాళ్ళు బాధపడుతుంటే చూసి సంతోషించటం కొంతమందికి 'హాబీ'. దానికి డబ్బు ఖర్చు అవుసరంలేదు."

"నిజమే. మనస్తత్వాలు తెల్సుకోకుండా మాట్లాట్టం అలాంటివాళ్ళ దృష్టిలో హాబీనే. పోనీలే, వాళ్ళ సంగతి మనకెందుకు. ఇంకా ఏమిటి విశేషాలు. ఉంటావా రెండు రోజులు."

"లేదు. బావ ఉత్తరం రాస్తే వచ్చాను."

"సుభద్ర పెళ్ళా."

"సుభద్ర పెళ్ళి విషయం వాళ్ళేమీ అనుకోటం లేదే."

"మరి."

"బాబు విషయంలో బావ చాలా బాధపడుతున్నారు. వాడికి సరిగ్గా పోషణ జరగటంలేదని. ఎవరెంత చేసినా తల్లిలేని కొరత తీర్చలేంకదా రమా, నిజంగా కోపమొచ్చి తల్లి కొట్టినా, బిడ్డ కించి ఒక గంట అలస్యంగా నీళ్ళు పోసినా, పని తొందర్లో తెమిలక పవుడరు రాచి బొట్టు పెట్టక పోయినా ఆ తల్లిని ఎవరూ ఏమీ అనరు. అది ఎబ్బెరికంగా గాని, వెలితి చూపటంత తప్పుగా

గాని తోచటం. అదే ఇతరుల పెంపకమయితే ప్రతి విషయానికీ గోరంతలు కొండంతలుగా చిత్రిస్తారు. లోకం తీరే అంత.''

''నిజమే సీతా.''

''రమా.''

''ఏం సీతా.''

''ఒక్క విషయం అడుగుతా ఏమీ అనుకోవు గదా.''

''ఏమీ అనుకోను ఏమిటది.''

''మొట్టమొదటిసారి మీయింటి కొచ్చినప్పుడు నాకు ఎన్నో విషయాలు చెప్పావు. మగవాళ్ల మన స్తత్వాలు పూర్తిగా తెల్సుకోవాలనీ, ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మకూడదో తెల్సుకోవాలనీ, అందుకుగాను వాళ్లతో స్నేహం చేసి, వాళ్లను వీ చుట్టూ తిప్పుకోవాలనీ, అప్పుడే వివాహ విష

# హృదయ కుసుమాలు

యంలో ఒక నిర్ణయానికి రాగలననీ, చెప్పావు. గుర్తుందా రమా.''

రమాదేవి నవ్వింది. ముభావకంగానే నావైపు చూసి ''అవును. గుర్తుంది సీతా'' అన్నది.

''ఏమయినా ఒక నిర్ణయాని కొచ్చావా.''

''అంటే.''

''బి. కాం. ఈ సంవత్సరంతో అయిపోతుందిగా. తరువాత శుభలేఖ పంపుతావా'' నవ్వుతూ రమాదేవి ముఖంలోకి చూశాను. క్షణం తలొంచు కుంది రమాదేవి.

''ఏ నిర్ణయానికీ రాలేదు సీతా. ఏ నిర్ణయానికి రావాలో అర్థంకావటంలేదు. మనం అర్థం చేసుకున్నా ఇతర్ని అంటే మన మంచి చెడ్డలు కాంక్షించే వాళ్లని అర్థం చేసుకోవాలిగా...''

''అంటే నువ్వు అర్థంచేసుకున్నా ఇతర్ని అర్థంచేసుకోలేదనా లేక నీ అన్వేషణ ఇంకా పూర్తి కాలేదనా.''

''రెండూను.''

''అంటే.''

''మనల్ని ముందు మనం అర్థంచేసుకోవాలి. మన మనస్సు మన చెప్పుచేతల్లో ఉన్నప్పుడు మన నిర్ణయం దానంతట అదే ఏర్పడుతుంది. జీవితసమస్యల్ని పరిష్కరించుకోటానికి జానకిలాంటి వాళ్లకి ఒక జీవితకాలం పడుతుంది. ఆ జీవితాలు దగ్గరుండి చూసినా ఎదుటి వాళ్లు తమ జీవిత సమస్యలు ఎట్లా పరిష్కరించుకోవాలో అర్థంకాక సతమతమౌతూంటారు. ఏమంటావు సీతా'' అన్నది.

''నిజమే.''

''బాబు మంచి చెడ్డలు చూడవలసిన బాధ్యత నీమీదా కొంతవరకు ఉంది సీతా.''

''నామీదనా.''

''అవును.''

''ఎందుకని ?''

''బాబు పినతల్లివి. తల్లి తరువాత పినతల్లికే బాధ్యత ఉంటుంది. ఎంత తప్పుకుందామనుకున్నా నీ బాధ్యత నుంచి నువ్వు తప్పుకోలేవు జానకి స్థానంలో నువ్వుంటే పెద్దలంతా హర్షిస్తారు. అందరి కోరికా అదే. జానకి ఆత్మ కూడా శాంతి స్తుంది. మీ బావ ఉద్దేశ్యమూ అదే. ఈ విషయంలో నూటికి నూరు మార్కులూ నీవే.'' ఏదో నిశ్చయాని కొచ్చిందానిలా నావైపు చూస్తూ అన్నది రమాదేవి. ఆ మాటల్లోని తొట్రుపాటు నేను గమనించాను. రమాదేవి కంఠం విచారంతో పూడి పోయినట్లు ఉంది.

''మీ అందరి కోరికా అంతేనా?''

''నిజం సీతా.''

''ముక్తకంఠంతో మీరంతా నన్ను బావని చేసుకో మని సలహా యిస్తున్నారు.''

''సలహా కాదు. కోరుతున్నాం.''

''నా యిష్టాయిష్టంతో ప్రమేయం లేదా.''

రమాదేవి ఆశ్చర్యంగా నావైపు చూసింది.

''అంటే ఈ విషయంలో నువ్వొక నిర్ణయానికి రాలేదా?''

''లేదు. నేనూ వ్యక్తుల మనస్తత్వాలు తెల్సు కోవాలనే అన్వేషణలోనే ఉన్నాను.''

''అంటే మీ బావ మనస్తత్వం నీకు తెలీంది కాదుగా, కొత్త సంబంధం కాదు.''

''అందుకనే బాగా ఆలోచించాలి. ఇంతకీ నీ సలహా.''

''మీ బావను చేసుకోమనే.''

''మనస్ఫూర్తిగా చెపుతున్నావా రమా.''

''మనస్ఫూర్తిగా చెపుతున్నాను.''

''ఆలోచిస్తాను.''

రమాదేవి ఆశ్చర్యపడింది. నేను వచ్చేశాను.

(సశేషం)

మీ కృషియే దేశానికి సౌభాగ్యం
మీ పొదుపే రక్షణనిధికి మదుపు

# హమామ్ వల్ల హాయిగాను కాంతిగాను వుండండి

శుభ్రపరచునట్టియు, శరీర కాంతి నిచ్చునట్టియు హమాము సబ్బును ప్రతి దినమూ వాడండి. మంచి సువాసనగల, సమృద్ధియైన హమాము నురుగు మీ శరీరమును శుభ్రపరచుటయేగాగ చులకన పరచును—మీకు మంచి తేజస్సునిచ్చుయీ సబ్బును ప్రతి రోజూ వాడి చూడుడు—దాని సుగుణము మీరే తెలుసుకొనగలరు—హమామును వాడండి. (చాలా రోజులువచ్చే హమాము—ఎల్లప్పుడూ మెత్తబడకుండు హమాము టాయిలెట్ సబ్బు.)



# బంగారునడచిన బాట

18 వ పేజీ తరువాయి

అంతా బంగారు మహిమ!!'' అనుకున్నాయి అవి. తమ రాజు మంచివాడైపోయినందుకు సంతోషించాయి

ఏనుగు పరుగు పరుగున వెళ్ళి,దగ్గరలోనున్న కాలువలోనుండి తొండంతో నీళ్ళుతెచ్చి, దూరంవించే పులి ముఖంమీద చిమ్మింది. పులికి తెలివి వచ్చింది. నీరసంగా కళ్ళుతెరిచి చూచింది.

''పులిరాజా! నిన్ను క్షమించాము. నీ పాపాలను కడిగివేయుమని దేవుణ్ణి వేడుకుంటున్నాము.''అన్నాయి జంతువులు ఏక కంఠంతో.

''ఆనందం ! పరమానందం !..సోదరులారా! దేవుడు మిమ్మల్ని కాపాడుగాక !'' అంటూ ముందరి కాళ్ళెత్తి నమస్కరించింది పులి. ''ఈజీవితం యిక చాలు ! ప్రజానురంజకంగా పాలించలేని ఈ పదవి కూడా యిక వద్దు. మీకు యిష్టం వచ్చిన రాజును మీరు ఎన్నుకోండి! ఒండి! ఒక్కుమ్మడిగా నా చుట్టూ చేరి, ఆ లోకానికి సాగనంపండి.!'' అంటూ దైవాన్ని స్మరిస్తూ కళ్ళు గట్టిగా మూసుకొంది. రెండుక్షణాల తరువాత మళ్ళీ కళ్ళుతెరిచింది ...జంతువులు దగ్గరికి రాలేదు.

పులి కృతనిశ్చయంతో—''సరే !....నాకు చావాలని ఉన్నది. మీరేవా నన్ను చంపరు. ఇక నేనే ఆత్మహత్య చేసుకుంటాను. దూరంగా వున్న ఆకొండకొమ్ముపైకి వెళ్ళి । కిందిలోయిల్లోకి దూకి చచ్చిపోతాను. పోయి వస్తాను. మీకందరికి శుభమస్తు !'' అంటూ లేచి ఒళ్ళు దులుపుకుని మెల్లగా ఒంటిసింగా నడువ సాగింది.

కాని, అదిఅలా పది అడుగులైనా నడువలేదు. అంతలో—అడవిలోని జంతువులన్నీ అన్నివైపులనుండి పులిని సమీపించి, భక్తి గౌరవాలతో దానిముందు మోకరిల్లాయి. ''రాజా ! నీ భృత్యులము—నీ కాళ్ళనంటి వేడుకుంటున్నాము. మమ్మల్ని కరుణించు నువ్వు చచ్చిపోవద్దు. ఎన్ని జన్మల పుణ్యఫలమో—ఈ నాడు మా రాజు దయాసాగరుడైనాడు. ఆ దయారసం మాకు లేకుండా చేస్తావా?...మమ్మల్ని దిక్కులేనివారిగా చేస్తావా ?...మేము ఉవ్విళ్ళూరుతున్న నీ చల్లని దొరతనం నేడు ఎండమావి చేస్తావా ?...'' అంటూ ప్రాధేయ పడ్డాయి.

''బిడ్డలారా ! నన్ను పోనివ్వరా ? నన్ను మళ్ళీ ఈ బంధంలో ఇరికిస్తున్నారా ?...వద్దుబాబూ !వద్దు ! దయచేసి దారితొలగండి. నన్ను పోనివ్వండి !'' అంటూ ముందుకు సాగబోయింది పులి.

జంతువులు దాన్ని పోనివ్వలేదు. రాజుగారి కాళ్ళు పెనవేసుకున్నాయి. ''రాజా ! నిన్నుపోనివ్వం ! ఏలుకుంటే మమ్మల్ని ఏలుకో ! కాదంటావా ? మమ్మల్నందరినీ చంపేసి, నీదారి నువ్వు చూసుకో ! ''అంటూ భీష్మించాయి.

పులి కొంతతడవు ఆలోచించింది. తల పంకించింది. పెద్దగా నిట్టూర్పు విడిచింది. ''సరే !.... నేను చావాలనుకున్నాను. మీరేమో వద్దని పట్టుబడుతున్నారు. మీకోసం ఈ త్యాగం చేయక తప్పడం లేదు. మీ యిష్టమే నా ఇష్టం !'' అంది.

జంతువులన్నీ సంబరంతో తమ రాజును పైకెత్తేశాయి. ''పులిరాజుకు జై'' అంటూ అరణ్యమంతా ప్రతిధ్వనించేలా హర్షధ్వానాలు చేశాయి.(ఇంకా వుంది)









## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థనం.

# గళ్ళ నుడికట్టు

ఈ నుడికట్టులో మొత్తం పది మాటలు. అన్నీ అడ్డంగానే వస్తాయి. ఆధారాలను బట్టి పైనుంచి కిందకి వరుసగా పది మాటలనీ వూహించాలి. కాని ఏ మాటలో ఎన్ని అక్షరాలు ఉన్నాయో తెలుప బడటం లేదు కాబట్టి (ఎందులోనూ 5 కన్నా ఎక్కువ ఉండవు !), కాళీ గళ్ళు ఏవో సూచింప బడటంలేదు కాబట్టి, నుడికట్టు పూర్తి చేసేవారు మాటలని ఇటూ అటూ జరిపి నిలువుగా ఈ సంచిక సందర్భంలో వినవలసిన నినాదం ఒకటి వచ్చేట్లు చూసుకోవాలి—అంటే, పది మాటలూ వాటికి తగిన గళ్ళలో వ్రాస్తే వాటిలో కొన్ని అక్షరాలు నిలువుగా ఒక అర్థాన్ని ఇస్తాయన్న మాట !

- ఒక జంతువు; కాలత.
- నీటిలో తేలేది !
- ఈ వ్యక్తి వంశము ఒక పురాణ గ్రంథము !
- లోడీని జయించిన దెవరు ?
- నుదురు
- బహదూర్ ముందు రెండక్షరాలు !
- ప్రేమము, సంతోషము, నెమ్మది, క్షేమము !
- హ్రా, హ్రూ, హ్రీ, హ్రీ, —
- మోతీలాల్ వృత్తి !
- ధర్మసూత్రాలూ, భారతం ఈ రచయిత పేర ఉన్నాయి.

[జవాబు 55వ పేజీలో]

## తనకిష్టమైనవి...

"ఎఫ్. టి. బ్రూక్స్ ప్రోత్సాహంతో నేను చాలా ఇంగ్లీషు పుస్తకాలే చదివాను. ఈ చదువులో లక్ష్యం ఏదీ లేకపోయినా, చిన్న పిల్లల సాహిత్యంలో నాకు మంచి ప్రవేశమే ఉండేది. లుయిస్ కారాల్ పుస్తకాలంటే నాకు చాలా ఇష్టం; 'జంగల్ బుక్, కిమ్' (కిప్లింగ్‌వి) లు కూడా నాకు బాగానచ్చాయి. 'డాన్ క్విక్సోట్'కి గస్టేవ్ డోర్ వేసిన బొమ్మలు నన్ను ముగ్ధుడిని చేశాయి. ఫ్రిట్జాఫ్ నాన్సెన్ రచన 'ఫార్దెస్ట్ నార్త్' సాహస రంగాల మీదికి నా దృష్టిని మరల్చింది. స్కాట్, డికెన్స్, థేకర్, హెచ్. జి. వెల్స్, మార్క్ ట్వెయిన్ వీరి నవలలు, షెర్లక్ హోమ్స్ కథలు చదవటం నా కింకా గుర్తు. 'ప్రిస్నర్ ఆఫ్ జండా' చదివి పులకించి పోయాను. జరోమ్. కె. జరోమ్ రాసిన 'త్రీ మెన్ ఇన్ ఎ బోట్' కన్నా తమాషా పుస్తకం ఉంటుందా, అనుకున్నాను. దుమారియర్ రచన 'ట్రిల్బి' నా స్మృతి పథంలో నిలిచి పోయింది; 'పీటర్ ఇబ్బెట్సన్' కూడా అంతే. కవిత్వం అంటే నాకు చాలా ఇష్టం కలిగింది యీ కాలంలోనే. ఈ ప్రీతి, నాలో ఇన్ని మార్పులు వచ్చిన తర్వాత కూడా చాలా వరకూ శాశ్వతంగా ఉండి పోయింది."

—స్వీయచరిత్రలో జవహర్‌లాల్ నెహ్రూ.

తానూ, కూతురూ, మనుమలూ !

# వదంతులను వినకండి
# వదంతులను ప్రచారం చేయకండి

స్వర మాధుర్యంలో నవ పరిమళాలు

**Sharp JHANKAR**

షార్ప్ ఝుంకార్

ట్రాన్సిష్టర్లు, రేడియోలు, రేడియోగ్రాములు

మోడలు విసి–053
5 ట్యూబులు, 3 బ్యాండులు
ఏసి లేదా ఏసి/డిసి, అక్రోటు
చెక్కతో వెనీర్డ్ క్యాబినెట్.
వెల విసి–053 రు. 250/-
విసి–053ఏ రు. 275/-
ఎక్సైజు సుంకము, పన్నులు అదనము

మోడలు టిఆర్–480
9 ట్రాన్సిష్టర్లు, 4 బ్యాండులు
వేవు మార్పు దర్శకము, రేడికేటర్
సూక్ష్మమైన ట్యూనింగ్
వెల రు. 375/-
ఎక్సైజు సుంకము, పన్నులు అదనము

మోడలు యుసి–143
4 ట్యూబులు, 3 బ్యాండులు
ప్రకాశవంతమైన డయలు
ఆకర్షవంతమైన క్యాబినెట్.
వెల రు. 165/- ఎక్సైజు సుంకము, పన్నులు అదనము

మోడలు హెస్ప్ ఎఫ్–464
హై-ఫిడిలిటీ మోడలు
6 ట్యూబులు 4 బ్యాండులు
ఆర్ ఎఫ్ స్టేజి 3 స్పీకర్లు
వెల రు. 475/-
ఎక్సైజు సుంకము, పన్నులు అదనము

హయకావా ఎలెక్ట్రిక్ కం., జపాను వారి సాంకేతిక సహాయంతో నిర్మితము

JHANKAR

రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు నం. 197008

ట్రాన్సిష్టర్ రేడియోలలో అగ్రగణ్యులు

రేడియో డివిజన్ ఇండియన్ ప్లాస్టిక్స్ లిమిటెడ్.

ASP/IM-66 TEL

పశ్చిమమునకు, దక్షిణమునకు ప్రాంతీయ డిస్ట్రిబ్యూటర్లు:
ఇండియన్ ప్లాస్టిక్స్ లిమిటెడ్, లోటస్ హౌస్, 33 ఏ, మెరైన్ లైన్స్, బొంబాయి–1.

# ఆశ్రయం

చాంద్





సూర్యుడుదయించాడు. ఈరోజు సూర్యోదయానికి కొంత కొత్త విశిష్టత వున్నట్లు తోచింది, దంతధావనం చేసుకొంటున్న శివకామయ్యకు. ఈ సూర్యుడస్తమించేసరికి తనజీవితంలో మరో అధ్యాయం ముగిసిపోతుంది. ఆతర్వాత అధ్యాయం ఎలాప్రారంభించడమనేది సమస్యగా తయారైనది.

ఇప్పటిలాగే కూతురు, అల్లుడింటిలో వుండిపోతే బాగానే వుంటుంది. కాని యిహనుండి సంపాదనలేని తనను ఎన్నాళ్ళని పోషిస్తాడు అల్లుడు మాత్రం ? పోనీ, ఆర్నెలలు మధుసూధనం దగ్గర, ఆర్నెలలు మురహరి దగ్గర వుంటే ?— అలాగే వుండొచ్చు. కాని ఈవూరువిడిచివెళ్ళటానికిమాత్రం మనసొప్పటంలేదు. పైగావాళ్ళు పట్టుమనిపదినెలలు ఒకవూళ్ళోస్థిరంగా వుండటంలేదు. ఏం ట్రాన్సఫర్లో, ఏమో!..వాళ్ళతో పాటు తాను తిరగాలి. ఈతిరగడం, ఈవయస్సులో తనకిష్టంలేదు. ప్రశాంతంగా గడపాలనుకొన్నరోజులు కాస్తా, భారంగా గడుస్తాయి. కొంత యింట్లో వుండిపోవచ్చు. కొంతకు తానంటే ఎంతో అభిమానం, గౌరవమూ. కాని, చెడి చెల్లెలింటికి వెళ్ళకూడదని అందరూ అంటారు. దానివల్ల ఏమైనా అనర్థాలు, కలతలు వస్తాయేమో!

ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే, ఆఫీసు వేళవుతుంది. అందులోను, ఆఖరిరోజు. మళ్ళీ ఆఫీసు ముఖం చూసే భాగ్యం ఈ జన్మలో లభించదు.

శివకామయ్య పూళ్ళో అందరికి తెలుసు. కాని శివకామయ్య పేరుతెలిసినవాళ్ళు బహుతక్కువ. "పేరుతో పరిచయం వున్నవాళ్ళుకూడా'' శివకామయ్య అంటే తహసీల్దారు గారి ప్యూనేనా ?''అని అడక్క మానరు. 'శివకామయ్య' పేరుతోకన్న 'తహసిల్దారు గారి ప్యూను'గా కొంతకీర్తి సంపాదించు కొన్నాడు శివకామయ్య.

ప్రభుత్వానికి తన జవసత్వాలమీద నమ్మకం సన్నగిల్లకపోయినా, వయస్సు మీరిందనే విషయాన్ని ఆలోచించి రిటైర్ చేస్తున్నారు.

ఈ చిన్న ఉద్యోగంతో శివకామయ్య సాధించిన కార్యాలనేకం. జీవితంపై అతని ఘనవిజయాన్ని తెలుసుకొని ప్రశంసించని వారుండరు. శివకామయ్య తండ్రికి, శివకామయ్యలోవున్న ముందు చూపులో వందవ వంతు ఉండి ఉన్నట్లయితే, ఈనాడు శివకామయ్య, 'తహసిల్దారుగారి ప్యూనుగా'గాక ఒక 'గెజిటెడ్ ఆఫీసరుగా' రిటైర్ అయ్యుండేవాడు.

అలానని శివకామయ్య, తండ్రిని మనస్సులోనైనా నిందించలేదు. 'తన కర్మానుసారం, ఈ జీవితం, ఇలా గడపవలసిందే' అనే వేదాంతవాదాన్ని పాటించి, తన జీవితపుబాటపై పడిదుడుకుల్లేకుండా, సాఫీగా నడచి వెళ్ళిపోసాగాడు. ఎంత జాగ్రత్తగా నడచుకొన్నా, ఒకచోటఆగి కొంత విచారించక తప్పలేదు.—శివకామయ్యకు. సహధర్మచారిణిగావుంటూ, తన కష్టసుఖాల్లో భాగం పంచుకొని, క్లిష్ట సమయాల్లో ధైర్యంగా ముందుకు నడిపిస్తూవచ్చిన, పార్వతమ్మ, కొడుకుల్నిద్దరిని,కూతుర్నివిడిచి శాశ్వతంగా వెళ్ళిపోయినప్పుడు శివకామయ్య రోదించిన రోజులు, అతని జీవితంలోని విషాదఛాయలు.

శివకామయ్య అంతగా చదుకోలేకపోయినా, చదువు యొక్క విలువ మాత్రం తెలుసుకొన్నాడు. తనకండలు కరిగించి, రక్తం ధారబోసి, సంపాదిస్తున్న చిన్న మొత్తంతో, పెద్దవాడు, మధుసూధనరావుని బి.ఏ వరకు చదివించి, తహసిల్దారు ధర్మమంటూ పోలీసు డిపార్టుమెంటులో సబిన్స్పెక్టరుద్యోగం,రెండు సంవత్సరాల్క్రితం సంపాదించి పెట్టగలిగాడు అది శివకామయ్య జీవితంలోని మొదటి విజయం.

రెండోవాడు మురహరిని, 'డాక్టర్ మురహరి' గా చేయడం, నిజంగా తహసీల్దారుగారి ప్యూనుకు రెండవ ఘన విజయం. సంవత్సరం క్రితం గుంటూరు గవర్నమెంటు హాస్పిటలులో అసిస్టెంటు సర్జను 'గెజిటెడ్ ఆఫీసరు' హోదాలో, తన కొడుకు ప్రవేశిస్తున్నాడని విని, శివకామయ్య ఆనందానికి పట్టపగ్గాలు లేకపోయాయి.

ఇంకా ఎన్నోసాధించగలిగాడుతనయోజనాత్మకమైన దృష్టితో శివకామయ్య. అందులో ఆడ పిల్ల, రాధ పెళ్ళి చేయడం ఒకటి. ఈ విధంగా తన చుట్టూ స్వర్గమేర్పరచుకొన్నాననుకొనే శివకామయ్యకు, తను రిటైర్ అయి పోతున్న సమయంలో చేతిలో చిల్లిగవ్వ లేకపోవటం, కొంత విచారం కలిగించింది.

అప్పుడే తొమ్మిదైంది. ఇంకో అరగంటలో ఆఫీసు చేరుకోవాలి. మనసంతా చికాకుగా ఉంది. వాడిన మల్లె పూల చెండు ఎవరో విసిరారు. అది శివకామయ్య దృష్టినాకర్షించింది. ముసలి కుక్క రోడ్డు వార పడి మూల్గుతుంది. ముసలి ఎడ్లను తోలుకు పోతున్నాడు కసాయివాడు.

వాడిపోయిన మల్లెపూలకు గౌరవం లేదు. ముసలి కుక్క ఆర్తనాదం విని ఎవరికీ దయరాదు. ముసలి ఎడ్ల ప్రాణాలకు విలువ లేదు. ఈ ఆలోచనలో ఏదో నగ్న సత్యం గ్రహించాడు శివకామయ్య.

ఆఫీసులో ఒక్కొక్క గంట గడుస్తున్నకొద్దీ, ఉరిశిక్ష అనుభవించడానికి ఒక్కొక్క గంట ముందుకొస్తున్న ఖైదీలా ఆవేదన అనుభవించాడు.

ఆఫీసులో అందరూ పరామర్శించారు. పెద్దకొడుకు దగ్గిరుండి, సుఖంగా ఏకు చింతా లేకుండా కాలం వెళ్ళబుచ్చమని కొందరు సలహా ఇచ్చారు.

కాలం తిరగటం మానలేదు. సూర్యుడస్తమించడం మానలేదు. శివకామయ్య రిటైరవ్వడం తప్పలేదు. జైలులోంచి విడిచి పెట్టిన ఖైదీలా

[illegible]

మాత్రం నిర్ణయించుకో లేక పోయాడు. ఆఫీసు వదిలి పెట్టే రా బుద్ధి వేయలేదు. మౌనంగా తనలో తనే ఏడ్చాడు తృప్తిగా.

*  *  *

విజయవాడ స్టేషనులో రైలు ఆగింది. శివకామయ్యసామాన్లు దించి మధుసూదనం కోసం ప్లాటుఫారమంతా కలియ జూచాడు. ప్రయాణీకుల రద్దీ దాదాపు పూర్తిగా తగ్గిపోయింది. ఇంకా మధుసూధనం కోసం నిరీక్షించడం వ్యర్థమనుకొని, పోర్టరు చేత సామాన్లు పట్టించుకొని స్టేషను బయటకు చేరుకొన్నాడు.

"తను వ్రాసిన ఉత్తరం అందలేదేమో! అంది ఉంటే తప్పక వచ్చితీరేవాడే, మధుసూధనం. ఐనా పోలీసు డిపార్టుమెంటులో పని చేస్తున్నాడు గదా, అర్జంటు పనేదైనా ఉండి రావడానికి వీలు చిక్కలేదేమో. అని సమాధానపడి, రిక్షాలో ఇంటికి బయలు దేరాడు శివకామయ్య.

శివకామయ్య ఇంట్లో అడుగు పెట్టగానే, "తాతయ్యొచ్చారు, తాతయ్యొచ్చారు" అంటూ కాళ్ళను చుట్టుకొన్నాడు, ఐదేళ్ళ రఘు. మనవణ్ణి ఎత్తుకొని, తనివితీర ముద్దాడి, మిఠాయి పొట్లం అందించి క్రిందకు దించాడు శివకామయ్య.

"ఎప్పుడొచ్చావు నాన్నా? ఉత్తరమైనా వ్రాయకుండా వచ్చేసావే! కబురు పంపిఉంటే, స్టేషను కొచ్చేవాణ్ణి గదా." సాదరంగా తండ్రిని పలకరించాడు. మధుసూదనరావు.

"నేనొస్తున్నట్లు ఉత్తరం వ్రాసానే! అందలేదన్నమాట. దానికేంలే. అందరూ కులాసాయేనా? అబ్బట్లు కోడలేది?"

"అందరం కులాసాగానే ఉన్నాం. మీకోసం స్నానానికి వేడి నీళ్ళు తోడిఉంచాను. స్నానం చేసిరండి. భోజనం చేసి కాసేపు విశ్రాంతి తీసుకొందురు గాని" నవ్వుతూ ఎంతో అప్యాయత కనబరుస్తూ, పలికింది అప్పుడే లోపలికి వచ్చిన అరుంధతి.

కోడలి అప్యాయతను, తన గురించి చూపుతున్న శ్రద్ధను, శివకామయ్య శరీరం ఆనందంతో గగుర్పొడిచింది. శేష జీవితం ఇక్కడే, ఏ లోటు లేకుండాగడచి పోతుందని భావించాడు.

స్నానానికి బట్టలు మార్చుకుని కళ్ళ జోడు పెట్టెలో పెట్టబోయి, అందులో ఉన్న ఉత్తరాన్ని చూసి ఆశ్చర్యపోయనారు. తన చేతులతో ఇక్కడికి వస్తున్నానని' వ్రాసిన ఉత్తరం అది. ఉత్తరం అందుకొనే స్టేషనుకు రాలేదన్నమాట మధుసూధనం; కొడుకు హృదయంలో ఏదో విషబీజం ఉందని మనసు గట్టి, దిగులు చెందాడు శివకామయ్య.

ఇక్కడికొచ్చిన నాలుగు రోజుల్లో శివకామయ్య గ్రహించింది. కోడలికి—తనంటే ఇష్టం. తన విషయంలో ఎంతో శ్రద్ధ చూపి, తనకిష్టమైన పదార్థాలు వండి పెట్టేది. ప్రొద్దుటనుండి రాత్రివరకు తనకు కావలసిన అవసరాలు స్వయంగా చూసేది. చివరికి పక్కవేసి, "గ్లాసులో నీళ్ళు పెట్టాను. అర్ధరాత్రివేళ దాహంవేస్తే, లేచి త్రాగండి" అని అని హెచ్చరించి వెళ్ళేది. మెత్తని మనస్సు. పెద్దలు అంటే అమిత గౌరవం అరుంధతికి.

కాని, కొడుకు విషయంలో సంశయం చేంలేదు, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. కొడుకు వింత ప్రవర్తనకు విస్మయం చెంది, ఆలోచనలతో మనస్సు పాడు చేసుకొనే వాడు శివకామయ్య.

తనపట్ల కొడుకు,కోడలి ప్రవర్తనలో సహస్రాంశం ఉంది. ఒకరి అప్యాయత చూసి, జీవితాంతం యిక్కడే ఉండి పోవాలనిపిస్తుంది. మరొకరి ముభావం చూచి క్షణం వెళ్ళిపోవాలనిపిస్తుంది. అందరూఉండికూడా తను నిరాశ్రయుడిలా బాధపడటం, శివకామయ్యకు సహించరానిదైంది.

కుర్చీలో కూర్చొని తనభవిష్యత్తునుగూర్చి ఆలోచిస్తున్న శివకామయ్యకు, మధుసూదనం కంగారుగా లోపలికి రావడం గ్రహించి,

"ఏమిటి విశేషం ?" అన్నట్లు కొడుకువైపు చూశాడు.

"నాన్నా నువ్వెళ్ళి లోపలగదిలో కూర్చో. డి.యస్. పి. గారు మనయింటికివస్తున్నారు"అన్నాడు, మధుసూదనం.

శివకామయ్యప్రాణం చివుక్కుమంది. కొడుకు ఆంతర్యం గ్రహించలేనంత అవివేకికాదు శివకామయ్య. తండ్రిని తహసిల్దారుగారిప్యూనుగా రిటైరయినట్లు పరిచయంచేయడం, మధుసూధనం తన హోదాకు అగౌరవంగా భావిస్తున్నాడని శివకామయ్య గ్రహించకపోలేదు.

భారంగా అడుగులేస్తూ, చిరునవ్వుతో గదిలోకి వెస్తున్న పంగతి మధుసూదనానికేం తెలుసు? ఇప్పుడు అవగాహనమైంది శివకామయ్యకు కొడుకు ప్రవర్తన.

మరొకరోజు అరుంధతి, శివకామయ్య తిరిగ్గా మాట్లాడు కుంటున్నారు. మధుసూధనం లోపలి గదిలో ఏవో ఫైళ్ళు తిరగేస్తున్నాడు.

కోడలి సమక్షంలో తన కష్టాలు, అవమానాలు మరచిపోయి , పసిపిల్లాడిలా అయిపోయేవాడు. శివకాకామయ్యఅరుంధతితో అంతటి సహనం, ప్రత్యేక విశేషత ఉన్నాయి.ఎవరి మనస్సులకు కష్టం కలిగించకుండా ప్రవర్తించడంతో, అరుంధతి తర్వాతె అందరూను.

అరుంధతి స్నేహితురాలు లోపలికొచ్చి, శివకామయ్యను చూసి సంశయిస్తు నిలబడింది.

"ఈయన మా మామగారు. తహసిల్దారాఫీసులో ........" అరుంధతి మాట పూర్తవక పూర్వమే

"అరుంధతీ, ఇలా ఒకసారి రా" మధుసూధనం గర్జన లోపలినుంచి వినబడింది.

"అమ్మాయి, వాడెందుకో పిలుస్తున్నాడు. వెళ్ళిరా" అన్నాడు శివకామయ్య, అరుంధతిని ఉద్దేశిస్తూ.

మధుసూధనం, అరుంధతిని ఎందుకు పిల్చాడో శివకామయ్యకు తెలుసు.

"శివకామయ్య, మధుసూధనం తండ్రని, రిటైరైన తహసీల్దారుగారి ప్యూనని, అందరితో పరిచయంచేసి, నన్ను అగౌరవపరచవద్దని, నిన్ను

'ఏరా! ఈ టైలరు రోజు రోజుకి షర్ట్సులు వదులు తగ్గించి కుడ్తున్నాడా? గుడ్డ మిగులుస్తున్నాడా?...'

'అదే అడిగితే—పోయినెల్లలో మీరిచ్చిన కొలతల ప్రకారం కుట్టానని అన్నాడండి!...'

# ఆశ్రయం

దివు అగౌరవపరిచుకోవద్దని" భార్యను హెచ్చరిస్తూవిశే పిల్చి ఉంటాడు మధుసూధనం. శివకామయ్య కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి.

'బాహ్య సౌందర్యానికేగాని, ఆత్మ సౌందర్యానికి విలువలేని చోట, పేరు ప్రతిష్టలకోసం, హోదా కోసం, పెద్దలను మానసికంగా బాధించే చోటు ఒక్క క్షణం కూడా ఉండకూడదని' నిర్ణయించు కొన్నాడు శివరామయ్య.

మధుసూధనం మనస్సు నొచ్చుకోకుండా— "చిన్నవాణ్ణి చూడాలని ఉందని. రేపు ప్రొద్దుట బండికి గుంటూరు వెళ్తాను" అన్నాడు శివకామయ్య.

మధుసూదనం అభ్యంతరమేమీ చెప్పలేదు. పైగా సంతోషంతో ముఖం వికసించింది. శివ కామయ్య లెక్కపడు. అది గ్రహించికూడా ఏమీ ఎరగనట్లు పూరుకున్నాడు.

అరుంధతిమాత్రం "వచ్చి పదిహేను రోజులైనా కాలేదు, అప్పుడే వెళ్లిపోవటం ఏమిటి ? ఇంకా కనీసం నాలుగు రోజులైనా" ఉండమని బ్రతి మాలింది.

"అమ్మాయి నీకు అనుభవం తక్కువ. మనిషి లోని వ్యక్తిత్వాన్ని గ్రహించే జ్ఞానం నీలో ఇంకా కలుగలేదు. తండ్రికి కొడుకుపై ఎంతో అనురాగం ఉంటుంది. ఆ అనురాగాన్ని జయించే శక్తి నాలో లేదు. అందువల్ల నేను గుంటూరు వెళ్లవలసిందే" భావగర్భితంగా ఉన్న శివకామయ్య మాటలు, అరుం ధతికి అర్థంకాలేదు.

శివకామయ్య గుంటూరు చేరేసరికి మధ్యా హ్నం పన్నెండు దాటింది. ఇంట్లో మురహరి లేడు. శ్యామల ఏదో పత్రిక చదువుతోంది. మామగారిని చూసికూడా శ్యామల లేవలేదు. శివకామయ్యే సామాన్లు లోపల పెట్టించి, సోఫాలో కూర్చు న్నాడు.

శ్యామల కుశలప్రశ్నలు వేస్తుందని వూహించిన శివకామయ్యకు ఆశాభంగం కలిగింది. ప్రొద్దు నగా రెండు మెతుకులు తిని బయలుదేరాడు. ఆకలి దహించివేస్తుంది.

అరుంధతి, శ్యామల ప్రవర్తనల్లో ఎంతో వ్యత్యాసం ఉంది ! అరుంధతి తను రాగానే స్నానానికి నీళ్లు తోడింది. ఆకలి తీర భోజనంపెట్టింది. శ్యామల గొప్పింటి బిడ్డనిపించింది. తనను తహసీల్దారు గారి పూ్యనుగనే చూడగల్గిందిగాని, మామగారుగా గౌరవించడానికి ఆత్మాభిమానం అడ్డువచ్చి నట్లుంది.

"సాయంత్రంగాని ఇంటికిరారు" జవాబు చెప్పి, మళ్లా పత్రిక చదవడంలో మునిగిపోయింది శ్యామల.

క్షుద్బాధకన్న, ఇటువంటి స్వాగతం లభించిందన్న బాధ, ఎక్కువగా పీడించింది. శివకామయ్యను. తనకిక్కడ ఆశ్రయం లభించడం దుర్లభం అనుకొన్నాడు.

ఆ మాత్రం లౌక్యం లేసోయిందా శ్యామ లకు ? ఇంటికి వచ్చినవారిని గౌరవించాలన్న ఇంగిత జ్ఞానంలేని పసిపిల్లగాదు. మరి, ఎందుకిలా నిర్ల క్ష్యంగా ఉంది ? "భోజనం చేశారా, లేదా?" అని పరామర్శించే ప్రాథమిక జ్ఞానంలేనిది కాదు, శ్యామల. తన ఇంట్లో తనకు భోజనంచేసే హక్కు లేకపోయింది. భోజనం పెట్టమని అడిగేటంతటి ఆత్మాభిమానాన్ని చంపుకోలేదు శివకామయ్య.

"సరే, వాణ్ణి హాస్పిటలులో కలుసుకుంటాను. అన్నాడు శివకామయ్య, 'హోటలు భోజనం చేసి వస్తానని" చెప్పలేక.

దారిలో కనబడిన హోటలులో, కాస్త కాఫీ ఫలహారం సేవించి, హాస్పిటలుకు వెళ్లాడు. కాం పౌండర్ని "డక్టరు మురహరి ఎక్కడుంటాడని" అడిగాడు.

"వార్డులో రౌండుకెళ్లారు. ఇంకా స్పెపట్లో రావచ్చు. అందాక ఆ బెంచిమీద కూర్చోండి" అని రోగులు కూర్చునే బెంచి చూపాడు.

గంటకు పైగా గడిచింది.

"డాక్టరుగారు లోపలికి వచ్చి కూర్చున్నారు. వెళ్లండి" అన్నాడు కాంపౌండరు.

శివకామయ్యను చూడగనే, మురహరి ముఖం వివర్ణమైంది. దగ్గర్లో నిలబడి ఉన్న కంపౌండర్ని సైగజేసి బయటకు వెళ్లమన్నాడు.

కుర్రాడు : నాన్నోయ్! నీకు
పది రూపాయలు లాభం !
తండ్రి : ఎలాగోయ్ !
కు: క్వార్టర్లీ పరీక్షల్లో అన్ని
సబ్జక్టుల్లోనూ ముప్ఫయి
మార్కులకు పైగా వస్తే పది
రూపాయ లిస్తానన్నావ్ గా !
ఒక్కదాంట్లోనూ రాలేదు...

కె. రంగారావు (కాకరపర్రు)

"ఇక్కడికి ఎందుకొచ్చారు నాన్న? సాయంత్రం నేనే ఇంటికి వచ్చేవాణ్ణిగదా" అన్నడు మురహరి. హాస్పిటలుకు రావడం పెద్ద నేరమైనట్లు.

శివకామయ్య షుష్క నవ్వు నవ్వాడు.

ఆ నవ్వు వెనక దాక్కున్న రహస్యం వెంటనే గ్రహించగల్గాడు మురహరి.

"ఈ ఎండలో ఇక్కడికి ఎందుకొచ్చావు, అని ? ప్రయాణంచేసి వచ్చావుకదా, కాసేపు విశ్రాంతి తీసుకోవలసింది. అనవసరంగా శ్రమపడ్డావు" మాటలు సర్దుకున్నాడు, మురహరి.

శివకామయ్యలో ఉన్న చివరి ఆశాకిరణం కూడా అంతరించింది. 'తనకు ఆశ్రయం ఇవ్వగలిగేదిక ఒక్క శాంతే' అని మనస్సులో భావించి, రాజ మండ్రి వెళ్లిపోదామని నిశ్చయించుకున్నడు.

మురహరి ఇంట్లో రెండు రోజులు కూడా ఉండ లేక పోయాడు: కోడలి సూదిపోటు మాటలు, రెండవ వైపు మురహరి మైనం భరించడం కష్టమైంది.

మూడవ రోజు రాజమండ్రి ప్రయాణమయ్యాడు. అన్నయ్యను చూసి కంటతడిపెట్టుకుంది శాంత.

"ఈ ఇరవైరోజుల్లోను, ఎంతో చిక్కిపోయాడు. అక్కడి నీళ్లు నీకు పట్టలేదు. సుఖంగా ఇక్కడే ఉండిపో అన్నయ్యా" అంది శాంత ఆప్యాయంగా.

చల్లటిగాలి తగిలి మేఘం వర్షించినట్టు ప్రేమభరితమైన మాటలు విని, ఉప్పొంగివస్తున్న దుఃఖాన్ని అరికట్టలేక, కళ్లు, కన్నీటిబిందువులను చెంపలమీదకు జార్చాయి. కళ్లజోడు తీసి, తువ్వాలుతో కళ్లు అద్దుకున్నాడు శివకామయ్య.

"నువ్వు మానసికంగా చాలా బాధపడుతున్నా వన్నయ్యా. నిన్ననే అరుంధతి దగ్గిరనుండి ఉత్తరం వచ్చింది. అన్ని విషయాలు క్లుప్తంగా వ్రాసింది. ఉండు ఉత్తరం పట్టుకొస్తాను" అని లోపలికి వెళ్లింది శాంత.

"అరుంధతికి తనంటే ఎంత అభిమానం" మనస్సులో అనుకొన్నాడు శివకామయ్య.

శాంత ఉత్తరం తెచ్చి శివకామయ్యకిచ్చింది. శివకామయ్య ఉత్తరాన్ని పరిశీలించి, "నువ్వే చదువు. నా కళ్లు కాస్త నీకట్లు కమ్మినట్లు తోస్తు న్నాయి" అని శాంతకిచ్చాడు.

శాంత ఉత్తరం చదివింది.

లక్ష్మీ సమానులైన పిన్నమ్మగారికి,

నమస్కారములు. మామగారు పదిహేను రోజుల పాటు ఇక్కడ ఉండి, ఈవాళే గుంటూరు వెళ్లారు. ఆయన్ని ఎంతో గౌరవంగా, ప్రేమగా చూసుకొన్నాను. ఏ లోటు రానీయకుండా. కాని వెళ్లేటప్పుడు, ఆయన బాధగా, అసంతృప్తిగా ఇక్కణ్ణుంచి వెళ్లారు. దానికి కారణం మావారి ప్రవర్తనే.

"తండ్రి ఎటువంటివాడైనా, ఆయన్ని గౌరవించ వలసిన బాధ్యత మనది. మీరు ఇవాళ ఇటువంటి హోదాలో ఉండడానికి కారణం, మీ తండ్రే ! తండ్రి ప్యూను పనిచేశాడని చెప్పుకోడం, మీ గౌర వానికి భంగం అని భావిస్తున్న, మిమ్మల్ని చూస్తే నాకు జాలేస్తుంది. చాలీచాలని జీతంతో, బంట్రోతు ఉద్యగంచేస్తూ, తన సుఖసంతోషాలకు దూరమై మిమ్మల్ని ఇంతవాగుగా చేసినందుకు, ఎంతో గర్వం చాల్సింది పోయి, తన పేరు ప్రతిష్ఠలకు అవమానం అని తలచడం భావ్యంకాదు" అని నచ్చ చెప్పాను.

ఇక్కడ ఆయనకు జరిగిన పరాభవానికి, మళ్లా ఈ గుమ్మం తొక్కకూడదని నిశ్చయించుకొనుం టారు.

పందిరి ఎటువంటిదైతేనేం ? దాన్ని ఆధారం చేసుకున్న మల్లె తీగ నీడను, స్వచ్ఛమైన తెల్లటి పూలతో సుగంధాన్ని వెదజల్లుమన్నప్పుడు, పం దిరి గురించి, బాధపడడం దేనికి ?

"తను తక్కువవాడు. తనకెక్కడా గౌరవం లేదు" అనే భావనను, ఆయన మనస్సునుండి దూరం చేయాలి. ఈ మానసిక క్షోభ ఆయన్ని దహించివేస్తుంటే, నేను చూసి సహించలేను.

మామగార్ని నచ్చజెప్పి ఇక్కడకు పంపవలసిన బాధ్యత మీది.. ఆయన్ని పువ్వుల్లో పెట్టి పూజించే బాధ్యత నాది.

ఇట్లు
అరుంధతి.

ఉత్తరం విని సంతోషంతో ఉక్కిరి, బిక్కిరి అయ్యాడు శివకామయ్య. గుండెల్లో ఏదో ఖరేల్ మంది. బాధతో మెలికలు తిరిగిపోతూ 'శాంతా' అని గట్టిగా అరిచాడు. అంత బాధలోను చిరు నవ్వునవ్వాడు. ఆ నవ్వు చివరివరకు అలాగే ఉండి పోయింది, శివకామయ్య పెదాలపై. 

# సరాగమాల



వి.ఎ.కె. రంగారావు

నవంబరు 14వతేదీ అమరజీవి నెహ్రూ పుట్టిన రోజు. ఇటీవల ఆ శాంతిదూతను, జాతిపితను కీర్తిస్తూ వచ్చిన రికార్డులను యిప్పుడు పరిచయం చేయటం సమంజసం అనుకుంటాను.

ఎన్ 96265

ఈ రికార్డునున్న రెండుపాటలు ఘంటసాల పాడినవి. రావులపర్తి రచనలు. ఒకప్రక్క "లేనేలేవా" అనే విషాద గీతం. రెండవప్రక్క "జోహారు జోహారు పండిత జవహరు" అనే బృంద గానం. రచనలో ప్రత్యేకత లేదు. వరుసలు పేలవంగా వున్నాయి. బృందగానంలో తక్కిన కంఠాలు నాటకాలలో ఆదిన ప్రార్థనగీతాలు పాడేవారివిలా వున్నాయి. ఇది రికార్డింగ్ లోపమో, ఆ కంఠాలే అంతమాత్రపువో నాకు తెలియటం లేదు. ఒక మంచిమాట యీరికార్డు గురించి చెప్పాలంటే ఘంటసాల కంఠంలో విషాదం బాగా ధ్వనించినదన వచ్చు.

ఎన్ 96266

ఈ రికార్డు రెండు ప్రక్కలా "నమో నమో వీర జవహరు" అనిపెట్టి రచన. పాడినది పీఠాపురం. వరస చేసింది బి. గోపాలం. నెహ్రూ జీవిత చరిత్రలో కొన్ని ముఖ్యమైన అంశాలను ఉద్ఘాటించే అనిపెట్టి రచన సుకరంగా, సులభంగా బోధపడేటట్లు ఉంది. వరస సాధారణమే. పీఠాపురం జీవకళలుట్టిపడేలా పాడినా యిటువంటి పాటకు అటువంటి కళ ఎంతవరకు వాంఛనీయమో, సమంజసమో ఆలోచించవలసిన విషయమే.

ఎన్ 96267

రెండు భాగముల యీ రికార్డులో పెద్దన్న, గోపాలం, వి. వెంకటేశ్వర్లు పాడిన నెహ్రూ జీవిత చరిత్ర బుర్రకథ రూపంలో ఉన్నది. తాండ్ర రచన బాగానే ఉన్నా పాటలో పెట్టిన అంశాలను సమదృష్టితో యెన్నుకోలేదని, ముందు వెనుకలు (కాలగమనం దృష్ట్యా) గమనించలేదని తెలుస్తున్నది. అంతా బుర్రకథ ఫక్కీలో ఉన్నది. ఈ మాత్రం పాట పాడటానికి, ఈ పాటె వరుస చేయటానికి గోపాలం అంతటి సమర్థుడు అనవసరమేమో. పెద్దన్న కంఠం రెండు దశాబ్దాల క్రిందటి సూరిబాబు కంఠాన్ని ఖంగుమని జ్ఞాపకం తెస్తున్నది. ఉన్నంతలో వెంకటేశ్వర్లు కంఠం గురించి బాగోగులు నిర్ణయించి చెప్పటం వీలుకాని పని.

జి. ఇ. 37548.

రాజశ్రీ రచన "వినండి నెహ్రూ చరితం" పి. బి. శ్రీనివాస్ పాడగా రెండు భాగాలలో ఈ రికార్డుపైన పొందుపరచబడినది. శ్రీనివాస్ పాడిన పాటలలో ఇష్టమనేది లేకుండా చాలా అయిష్టత ఏర్పడిన పాటలలో యిది రెండవది. (మొదటిది "పెళ్లివారమండి") ఇంతటి అనిష్టతకు కారణం చాలా దారుణంగా ఉన్న వరుస. శ్రీనివాస్ గళం గందరగోళంగా రికార్డు చేయబడటం. రాజశ్రీ రచనలో ఏ వ్యాకరణ సూత్రాలనూ అనుసరించని ప్రాసలుండటం. వరస యెవరు చేశారో రికార్డుపైన వేయలేదు. అదీ ఒకందుకు మంచిదే.

జి. ఇ. 37547.

నెహ్రూ కీర్తనలలో బాగున్నవి, ఆముదపు చెట్టు సామెతను కాదు, నిజంగానే బాగున్నవి. సుశీల పాడిన రెండు పాటలు "వాడిపోయెనే", "జోహారులు". ఆరుద్ర రచన పెండ్యాల సంగీతం రెండిటిలోను ఒక ప్రత్యేకత, వస్తువుమీద వినే వాళ్లకు గౌరవం కలిగించే ఒక ప్రత్యేకత ప్రస్ఫుటంగా కనబడుతున్నది. సుశీల కంఠం చాలా తీయగా రికార్డు చేయబడినది (మునుపు వచ్చిన ఒకటి రెండు ప్రైవేటు రికార్డుల వలె కాక.)

"జోహారులూ" పాటలో సంతోషం. శాంతికి రూపమూ, శాంతికి దీపమూ అయిన ఆ మహా వ్యక్తి మరణించినా మనతోనే ఉన్నాడన్న సంతోషమూ, రెండవ పాటలో అంతటి మహనీయుని కోల్పోయితిమన్న విషాదమూ ధ్వనిస్తున్నవి. మొదటి పాటకు వరస, వాద్యగోష్ఠి ఉత్సాహవంతంగా ఉన్నాయి. రెండవ పాటలో రచనలో వాద్యానుసరణ హృదయాన్ని కదిలించేలా విషాదరాగం పలికింది.

ఇటువంటి పాటలు చేసేముందు ఆ చేసే వ్యక్తులు ఒకటి గమనించాలి. వంకాయల అమ్మకంపై, గాజుల బేరాల గురించి పాటలు, రచన వరుస నాసిరకంగా ఉన్నా ఫరవాలేదు. కాని ఉన్నతమైన వస్తువు నెన్నుకున్నప్పుడు తక్కినవి ఆ స్థాయిలో ఉండాలి. పై పాటల్లో కొన్నిటిని వింటుంటే అయ్యో అనిపిస్తున్నది. పదిహేనేళ్ల క్రితం బాలసరస్వతి పాడిన "పాడుకోను సెలవా పండిత నెహరూజీ" యింతకన్న ఎంతో మెరుగని తోస్తున్నది.

* * *

డిసెంబరు నెల మొదటివారంలో దత్తమండలంలో కొన్ని ప్రదేశాలు పర్యటించ లని అనుకుంటున్నాను. ఇప్పటి వుద్దేశంప్రకారం వాటిలో రాజంపేట, కడప, అనంతపురం. గుత్తి, ద్రోణాచలం, కర్నూలు, ప్రొద్దుటూరు, బద్వేల్, గూడూరు మొదలగు వూళ్ళు చూడవలసిన జాబితాలో వున్నవి. ఈ పర్యటన ఉద్దేశం ఏమామూలే. పాఠకులను కలుసుకుందామని, గ్రామఫోను రికార్డుల డీలర్లు యెలావున్నారో చూద్దామని. పై చెప్పిన నిర్ణీతమార్గానికి కాస్త అటూ యిటూ వెళ్ళటానికి అభ్యంతరం కూడా వుండదు. పాఠకులతో, సంగీతాభిమానులతో కలుసుకొనే యేర్పాటు యెవరైనా చేస్తామని ముందుగా వుత్తరంవ్రాసే నేను యేయే తేదీలలో యెక్కడవుంటానో తెలుసుకోవటానికి యిరవై అయిదు పైసల తపాలాబిళ్ళ జోడిస్తూ ఒక ఉత్తరం వ్రాయండి. నవంబరు ఆఖరులోగా అన్ని వివరాలు తెలుపుతూ వారికు వుత్తరం వ్రాస్తాను.

* * *

పి. వి. రాజమన్నార్ అధ్యక్షతన చిట్టిబాబు పుష్పగిరి పీఠాధిపతుల నుంచి వైణిక సార్వభౌమ బిరుదు గ్రహించిన వారం రోజులలోనే కొలంబియా వారు అతనితో రెండు కీర్తనలు రికార్డు చేశారు. ఒకటి హంసధ్వనిలో "వాతాపి", రెండవది విజయ వసంత రాగంలో "నీ చిత్తము నా భాగ్యమయ్యా" ఈ రికార్డు డిసెంబరు మాసాంతంలో లభ్యం కాగలదు. చిట్టిబాబు నిర్మల ఛాయలతోబాటు వాయించేది వీణ అని చదువరులకు విదితమే గదా!



## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### "పోదురూ! మరీ చిన్నవాళ్లైపోతున్నారు!"

ఇంగ్లడును పరిపాలించే రాణులూ రాజులు
ఎంచక్కా జరుపుకొంటారు ఏడాదికి రెండు పుట్టినరోజులు
ఒకటి నిజంగానే పుట్టినరోజు
ఇంకోటి లాంఛనాలు పాటించడానికి పెట్టిన రివాజు
నాకూ ఉన్నాయి అలాగే రెండు జన్మదినాలు
నేనూ చేసుకుందామనుకొంటాను ఉత్సవాలు
ఒకటి ఇంగ్లీషుతారీఖు వారిది
ఇంకోటి తెలుగు పంచాంగం వారిది
అవి జ్ఞాపకం వస్తాయి శ్రీమతి నా పూబోటికి
అవి జరిగిపోయిన మూడో నాటికి



శిలా తెలుగు నాటకసమితిని ప్రారంభించడాన్ని ప్రశంసించారు. ఉద్యోగులలోని శక్తిసామర్థ్యాలను పెంపొందించే కార్యక్రమాలను ప్రోత్సహించటం ప్రభుత్వ ఆశయమనీ, ప్రజలందరికీ వినోదం చేకూర్చడానికి జిల్లా కేంద్రంలో, పట్టణంలో క్లబ్బులుండాలని వారు అన్నారు.

నాటక కళ గురించి ప్రస్తావిస్తూ మంత్రి నాటకకళ పునరుద్ధరణ అవసరమని, సినిమా రంగం అభివృద్ధిచెందడం నాటకరంగానికి పెద్ద దెబ్బ అయినదని, అయితే ఈ రెంటినీకూడా సాధ్యమైనంతవరకూ అభివృద్ధిచెయాలని ఉద్ఘాటించారు.

సినీ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రసంగిస్తూ సినిమారంగం అభివృద్ధివల్ల నాటకరంగం దెబ్బతినలేదని, సినిమారంగంలో తన విజయానికి కారణం నాటకరంగంలో తనకుగల అనుభవమేనని, ఇందుకు తానీనాటికీ ఎంతో గర్విస్తున్నానని అన్నారు.

లలితకళల విషయంలో ఆంధ్రప్రదేశ్‌కంటే తమిళనాడు ఎంతో ఉత్సాహం చూపిందని, లలిత కళల అభ్యాసం, ఇతర విద్యలంతటివే ఎంతో ముఖ్యమైనదని తల్లిదండ్రులు తమ పిల్లల విషయంలో దీనిని గమనించాలని శ్రీ అక్కినేని అన్నారు. ఈ ఉత్సవాలకు ఆంధ్రప్రదేశ్ అకౌంటెంట్ జనరల్ శ్రీ వి.సుబ్రమణ్యం అధ్యక్షత వహించారు.

సమితి అధ్యక్షులు శ్రీ ఆర్.ప్రకాశరావు స్వాగతం చెప్పారు. ఉపాధ్యక్షుడు శ్రీ గోపాలకృష్ణ మంత్రి వర్యులకు, సినీనటునికి స్వాగతపత్రాలు సమర్పించారు. కార్యదర్శి శ్రీ ఎం.వి.రమణ నివేదికను సమర్పించారు.

అనంతరము శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి తెలుగు రంగస్థలానికి అనుసరించిన ''ఫణి'' (డయల్ యమ్ ఫర్ మర్డర్) అపరాధ పరిశోధక నాటకము సమితిసభ్యులచే ప్రదర్శింపబడినది.

నాటక ప్రదర్శనానంతరం కోశాధికారి శ్రీ వి. రాజారావు వందన సమర్పణతో సభ ముగిసినది.

* * *

కొంత కాలం క్రితం 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక'లో శ్రీ ఎస్. వి. రామారావుగారి లండన్ బొమ్మలు, వ్యాసం పడిన సంగతి పాఠకులకి జ్ఞాపకం ఉండవచ్చు. నవంబర్ 9వ తేదీన లండన్‌లో జరిగిన ఒక చిత్ర ప్రదర్శన కీ. శే. బెవాన్ భార్య శ్రీమతి జన్నీ లీ ఆవిష్కరిస్తారు; ఈ ప్రదర్శనలో శ్రీ రామారావుగారి చిత్రాలతోబాటు ఇంకా 5గురి బొమ్మలు ప్రదర్శిస్తారు వీరి పేర్లు, గజానన్ భగవత్, బలరాజ్ ఖన్నా, యశ్వంత్ మాలి, లాన్సెలాట్ రిబెయిరో, ఇబ్రహింవాగ్.

## 'మంగమ్మ శపథం'

డి.వి.ఎస్. ప్రొడక్షన్స్‌వారు ''మంగమ్మ శపథం'' చిత్రం నిర్మిస్తున్నారు. ఎన్.టి. రామారావు, రేలంగి, రాజనాల, రమణారెడ్డి, బాలకృష్ణ, అల్లురామలింగయ్య ఒక్కిలినేని, జమున, గిరిజ, రాజశ్రీ, ఎల్.విజయలక్ష్మి మొదలైనవారు నటిస్తున్నారు. శోభా



'తోటలోపిల్ల-కోటలో రాణి' లో రాజశ్రీ.

ఛాయ: సముద్రాల(జూనియర్), పాటలు: సి.నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం: టి.వి.రాజు, కళ: తోట, నృత్యాలు: వెంపటిసత్యం, ఎడిటింగ్: జోషి, ప్రొడక్షన్ ఇన్‌ఛార్జి: ఎస్.చిట్టిబాబు, దర్శకుడు: విఠలాచార్య, నిర్మాత: డి.వి.ఎస్.రాజు. రికార్డ్ చేసిన నాలుగు పాటలూ చిత్రీకరించారు. ఫిబ్రవరి నెలాఖరుకు నిర్మాణం పూర్తిచేయాలని అనుకుంటున్నారు.

## 'వారసత్వం'

శుభోదయా వారి "వారసత్వం" తుది మెరుగులు దిద్దుకొంటున్నది. అంజలీదేవి, ఎన్.టి.రామారావు, రేలంగి, గిరిజ, రాజబాబు మొదలైనవారు నటించే ఈ చిత్రానికి బరంపురం కొల్లాడి కథ వ్రాశారు. సంగీతం—ఘంటసాల, దర్శకత్వం—తాపీచాణక్య, నిర్మాతలు: శాస్త్రి, రంగారావు. నవంబరు రెండవ వారంలో విడుదలచేయాలని నిర్మాతల సంకల్పం.

# అవీ - ఇవీ - అన్నీ

## స్వీకారం

"నిఖిల ప్రపంచాన్ని ఆకర్షిస్తున్న" శ్రీనివాసు నిన్నే, శ్రీ శ్రీనివాస కాశ్యప ప్రత్యేకమైన కృషితో రచించిన 'శ్రీనివాస' పుస్తకం మా కార్యాలయం చేరింది. ఇందులో మనోహరమైన పద్యాలతోపాటు శ్రీ తిరుమల రామచంద్రగారి తొలిపలుకు, శ్రీ తిరుక్కుండూర్ వేంకట రామానుజాచార్యుల 'ఆశీః పంచ రత్నమాల', శ్రీ దాశరథి గారి అభిప్రాయం కూడా ఉన్నాయి. 'లోకం పోకడ'లను వివరించే చక్కని పద్యాలు ఇందులో ఉన్నాయి. ప్రతి ఒక్కరికీ అర్థమయ్యే శైలిలో వ్రాయటం, ఈ గ్రంథంలోని ప్రత్యేకత.

ఈ చిన్ని పుస్తకం ముద్రణ, ముఖచిత్రం బావున్నాయి. కవి శ్రీ శ్రీనివాస కాశ్యప కృషి నిజంగా అభినందనీయము.

(ప్రతులకు: కాశ్యప ప్రచురణలు, 35, తాండవరాయ ముదలివీధి, మద్రాసు—21, చిరునామాకు వ్రాయాలి)



'ప్రేమించి పెళ్ళిచేసుకో' కొత్తనటి కుమారి చంద్రకళ.

## రంగావలోకనం

అయిదారేళ్ల నుంచీ హిందీ చిత్రాలలో మొదలయింది టైటిల్స్‌లో అందరి పేర్లూ వేయటం. అందరంటే నా ఉద్దేశం తారాబలం, సాంకేతిక బలగం అని కాదు. ఈ రెండింటికీ చెందని గణాలని. హిందీ చిత్రాలలోనే మొదలైనది కేశాలంకరణ చేసిన వారి పేర్లు వేయటం. ఇది కూడ అపూర్వంలోకే వస్తుంది కాబట్టి, అక్కడ మేరీ జినెట్టా, వీణా పురోహిత్, ఇక్కడ తాపారపు భాస్కరరావు కేశాలంకరణలు నాయికానాయికల అంద చందాలను ఇతోధికంగా ఇనుమడింప జేస్తున్నవి కాబట్టి వారి పేర్లు వేయటం సమంజసమే. కాని అదేమిటో సెట్ కుర్రాళ్ల పేర్లు, కారు డ్రైవర్ల పేర్లు, సెట్ మీద కాఫీ, టీ అందించే వాళ్ల పేర్లు వేయుట హాస్యాస్పదం. వాళ్ల వృత్తులు గాని, వారి సామర్థ్యం కాని చిత్రానికి, ప్రేక్షకుడు వారి పేర్లు తెలుసుకోవాలని కుతూహల పడేటంతగా, ఉపకరించవు. ఇక యెందుకు వేస్తున్నట్లు ?

ఇక్కడే ఇంత లా ఉంటే ఇక అమెరికాదేశంలో ఇంకెంత దారుణంగా ఉందో గమనించండి. "పారిస్ వెన్‌యిట్ సిజ్‌ల్స్" అనే చిత్రంలో నాయిక ఆడ్రీహెప్‌బర్న్ ధరించిన దుస్తులతో బాటు అందుకొన్న అత్తరుకు కూడా ప్రసిద్ధ హ్యూబర్ట్ డి గివెంచీ అని టైటిల్స్‌లో ఇచ్చారు. పాశ్చాత్య దేశాలలో గివెంచీకి పెద్ద పేరున్న మాట నిజమే. వేలకు వేలుపోసి అతని ఆజమాయిషీలో తయారయిన దుస్తులను స్త్రీలు కొంటారన్న మాటా నిజమే. కాని ఒక చిత్రం షూటింగ్ సమయంలో నాయిక రాసుకున్న అత్తరు తయారు చేసిన వ్యక్తి పేరు కూడా టైటిల్స్‌లో గుర్తించడం అర్థంలేని పని.

ఈ ధోరణిలోనే మరొకటి. ప్రతి చిత్రంలో సంగీత దర్శకుని పేరు, నృత్య దర్శకుని పేరు విడివిడిగా వేస్తున్నారు కదా "బభ్రువాహన"లో రెండు కలిపి వేయుడంలో అంతర్యం ? నిర్మాత మనస్తత్వం కొంతయినా తెలుసు ననుకుంటున్నాను, కాబట్టే అది యెవరిని చిన్నబుచ్చటానికీ కాదని చెప్పగలుగుతున్నాను. మరి కారణ మంటూ ఉండాలి గదా ! ఏమిటో అది !

ఆ చిత్రంలోనే బభ్రువాహనుని వేషం ధరిస్తున్నాడని ఎస్. ఆప్పల' అని పేరిని చిరిచిన వాళ్లలో వే నాటకం. ఆ పౌరాణిక పాత్ర యెక్కడ

వాళ్లలో కూడా నే నొకడిని. ఇంతకు ముందెప్పుడో "స్వయంప్రభ"లో ఇటువంటి వేషం వేశాడని అన్నారు కాని అది వేరు. ఇక్కడ తన కెదురుగా ఉన్న దెవరు ? రామారావు, వరలక్ష్మి. అందులో అమర్నాథ్, శ్రీరంజని, కాని "బభ్రువాహన" చూసిన తరువాత నేనెంత పొరపాటు పడ్డానో చాల సంతోషంగా గ్రహించాను.

హాస్య నటునిగా, చవకబారు వెకిలి చేష్టలు చేసే హాస్యం కాక ఉత్తమమైన హాస్యం (కలవారి కోడలు) అందించగల నటునిగా పేరు బలానికి విలువ నివ్వని రోజు లేదు "పెళ్ళి సందడి" చూసిన తరువాత. ఇప్పుడు బరువైన (?) పాత్రలలో కూడా అంతగానూ రాణించ గలడని తెలిసి ఇంకా అతని పలుకుబడి నా అంచనాలో పెరిగింది.

"కలవారి కోడ"లో బలానికి యెదిరిగా వేసిన పద్మనాభం రేఖా యాండ్ మురళి ఆర్ట్స్ పతాకన ఒక తెలుగు చిత్రాన్ని నిర్మించనున్నట్లు అందరికీ తెలిసిన విషయమే అనుకుంటాను. ఆ చిత్రం గురించే కొందరికే తెలిసిన విషయం ఒకటి. ఆ చిత్రానికి "దేవత" అని నామకరణం చేసే ముందు ఓసారు బి. ఎన్ గారిని అడిగారట



'జంటస్వరాలు' ఎస్. రాజేశ్వరరావు, టి. చలపతిరావు.

నిర్మాత పద్మనాభం దర్శకుడు హేమాంబరధర రావు ఆ పేరు ఉపయోగించుకోవటానికి వారి అనుమతిని. నిజానికి ఆ పేరు బి. ఎన్. స్వంతం కాదు. అయినా ఆయన పెద్దతనాన్ని మనసులో పెట్టుకొని వీరిద్దరూ అడగటం చాలా సహృద్భావంతో సాగుకొన్న పని అని నాకు తోచింది. ఎంత మంది అంత స్వల్పమైన మర్యాదలను

అడిగిన అనుమతితో బాటు అడగని ఆశీస్సులు కూడా జోడించి బి. ఎన్. వారి కందజేశారని వేరే చెప్పనక్కరలేదనుకుంటాను. ★

## నుడికట్టు జవాబులు

— గ జ ము —

— నా వ — —

— — హా రి —

బా బ ర్ — —

— ల లా ట ము

— లా ల్ — —

— — నె మ్మి —

— — ప్రహ్లా — —

— వ కీ లు —

— జై మి ని —

జయభేరి పిక్చర్స్ తొలి చిత్రంలో రాజసులోచన

23 వ పేజీ తరువాయి

ఉంటే చూడడమే ఒక ఆనందం. ఢిల్లీ క్రికెట్ క్రీడారంగంలో సంవత్సరాల తరబడి తనజట్టును అతిచక్కగా ముందుకు నడిపించిన సమర్ధుడు వనవారి బాబాజీరావు. గత సంవత్సరం కాన్పూర్‌లో జాతీయ రక్షణనిధికై జరిగిన పోటీలో మూర్తి, బాలాజీలు, బౌలర్లు పంపిన ప్రతి బంతిని క్రీడాంగణంలోకి కొడుతూ ఉంటే, అడ్డుకొనే శక్తిలేక ఫీల్డర్లు చేతులు రుద్దుకొంటూ నిలబడిపోయారు.

## ఇతరులు

పేనీ చిన్న బితాలో ఇచ్చిన వివరాలు బహు కొద్ది. క్రికెట్ ప్రముఖు లందరూ ఇందులో వచ్చేరనడానికి వీలులేదు.

విజయ మర్చెంట్ తర్వాత ఇ. బి ఐబేరా వంటి చక్కటి ఆటగాడు ఇంకొకడు కనిపించడు. ఏ మాత్రం ఉద్రేక పడకుండా చక్కగా ఆడే ఐబేరా తన జట్టుకు యెంతో ఉత్సాహాన్ని ఇస్తాడు. చాలా కాలం హైద్రాబాద్‌లో క్రికెట్ అంటే మొదట జ్ఞాపకం వచ్చేపేరు భగత్ చంద్‌ఖన్నా. ఈ ఇద్దరూ అర్హులైనప్పటికీ టెస్టు రంగంలోకి ప్రవేశించలేక పోవడం శోచనీయం.

మద్రాస్‌కు చెందిన ఎమ్. సూర్యనారాయణ, కథాలోకంలోని గలివర్ వంటి వ్యక్తి. ప్రాంతీయ లీగ్ పోటీలలో, లిలీపుట్ దేశంలో గలివర్‌లాగ ఇతడు మహోన్నత కాయుడై కనిపిస్తాడు. ఎస్. జె. ఐ. సి.తో జరిగిన లక్నో టెస్టు వంటి పోటీలలో 'బ్రాబ్‌డింగ్ నేగ్'లో గలివర్‌వలె అంగుష్ఠ ప్రమాణుడై పోతాడు.

హరిహరశాస్త్రి, ఎమ్. బాలకృష్ణ, ఎస్. స్వామి యు. ఎస్. వి. వి. గోపాలరాజు, వెంకటగిరి సోదరులు, —కుమారరాజ, యాచేంద్ర— కె. గోపాలకృష్ణ (గోపన్న), ఎమ్. పి. కుమార్, బి. వి. కృష్ణరావు (బాబి), డి. వి. వి. గోపాలరాజు, జి. ఎస్. ఎన్. రాజు ప్రభృతులందరూ తమకు లభించిన కొద్ది అవకాశాలను శ్లాఘనీయంగా ఉపయోగించుకొని, సామర్థ్యాన్ని చూపించారు.

'చిన్నప్పుడే క్రికెట్ క్రీడను రంగరించి పోయడం' అన్న పనిలో చక్కని కృషి చేస్తున్న వ్యక్తి ఆర్. వి. ఎస్. రామారావు. ఢిల్లీలో ఉన్నప్పుడే ఇతను చక్కటి బౌలర్‌గా పరిగణింప బడ్డాడు. ఆంధ్రా విశ్వవిద్యాలయంలో, 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్సు కోచ్'గా ఇతడు ఆంధ్రా జట్టుకు వాల్తేరును కీలక స్థానంగా రూపొందిస్తున్నాడు. రాష్ట్రానికి మంచి జట్టును రూపొందించే కృషిలో ఇతను తన క్రికెట్ జీవితాన్ని వినియోగించు కున్నాడు.

క్రికెట్ ఆకాశంలో ఆంధ్రా నుండి కాంతి వంతమైన తారలు వెలుగొందే అవకాశం కనిపిస్తున్నది. పాత సంఘటనలనుండే భవిష్యత్తు రూపొందుతుందన్న మాట నిజమే అయితే ఆశాదృష్టికి అవకాశం కావలసినంత ఉన్నది. ★


Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.

